# విజ్ఞప్తి

మహాత్మా గాంధిగారి సత్యాగ్రహాస్త్ర ప్రయోగము వలన నెన్నఁడో తుడిచిపెట్టుకొనిపోయిన దుష్టశాసనములు - ఎమ్కూర మలాన్ స్ట్రీయిడామ్ మంత్రుల ప్రభుత్వాచర్యలవలన నేఁడు తలలెత్తి - నేఁటి దక్షిణాఫ్రికా భారతీయ సోదరుల నెట్లు వేధించుచున్నదియు - దినదినము మీరు పత్రికలలో జదువుచునే యున్నారు.

మన దక్షిణాఫ్రికా భారతీయ సోదరుల రాజకీయ పూర్వచరిత్రను దెలిసికొనవలెననెడి కుతూహలము కలుగుట సహాజమే గాన యీ గాథను తీసికొని మీ కందజేయు చున్నాను. మహాత్మునిచే వ్రాయఁబడిన "దక్షిణాఫ్రికా సత్యాగ్రహ"మను గ్రంథమున కిది కుప్తానువాదము. మహాత్ముఁడే తనపీఠికలో దీనికి 'ధర్మయుద్ధ'మని నామాంతర మిడియుండు టచే యీ యనువాదమున కీ పేరు పెట్టితిని. కేవలము ధర్మ సంగ్రామమును జక్కఁగ చిత్రించి, పాఠకుల రంజింపఁజేయుటకు మాత్ర మీ అనువాదము చేయలేదు. సర్వజనులకును, అందును ముఖ్యముగా భావిపౌరులు కాఁబోవు విద్యార్థిసోదరు లకును దైనందిన జీవితములో నుపయోగపడు నుత్తమ రాజ కీయ, ధార్మిక నైతికసూత్రము లిందుఁ బొందుపరుపఁబడి యున్నవి. కాన వానిని మన జీవితములో ననుష్ఠించి జీవిత యాత్రను సఫలము చేసుకొనగల మను నాశతో దీనిని ముఖ్యా ముగ ననువదించితిని. ఈ గ్రంథమువలన నే యొకవ్యక్తియైన తన జీవితమును సంస్కరించుకొనఁ గల్గిన నీ అనువాదము సఫలత నొందినట్లే!

— అనువాదకుఁడు.

# విషయసూచిక

| అధ్యాయము. | విషయము | పేజీ |
| --- | --- | --- |

# 1 వ అధ్యాయము

## నైసర్గిక స్థితి

'ఆఫ్రికా' అత్యంత విశాలమగు మహాఖండము. మన భరతవర్షముకంటె వైశాల్యమున దాదా పైమురెట్లు పెద్దది.

ఆఫ్రికా యత్యుష్ణ ఖండము. భూమధ్యరేఖ యీ మహాఖండ మధ్యముగఁ బోవుటచే నిందుఁ గొంతవఱకు సత్యమే కలదు. కాని, దక్షిణాఫ్రికా స్థితి వేఱు. భూమధ్యరేఖకు చాల దూరముగ నుండుటచేతను, సముద్రసమీపముగ నుండుట చేతను దక్షిణాఫ్రికా వాతావరణము ఐరోపా దేశీయులకు భరత వర్షముకంటె నెక్కువ యారోగ్యవంతమై, నివాస యోగ్యమై యున్నది. ఇందు టిబెట్టు కాశ్మీరములవలె నత్యున్నత ప్రదేశములు కొన్ని గలవు. శీతోష్ణస్థితి క్షయ రోగులకుఁగూడ చాల ననుకూలమై యుండును.

దక్షిణాఫ్రికాలోని స్వర్ణమయమగు నగరరాజమైన 'జోహాన్సుబర్గు' ఇట్టివానిలో నొకటి. ఈ గాథకు సుమారొకయేబది వత్సరములకుఁ బూర్వ మీ మహానగర మున్నచోటు నిరుపయోగమై యెడారివలె నుండెడిది. ఇక్కడ బంగారు గనులు కనిపెట్టఁబడిన తర్వాత నైంద్రజాలికుని మంత్రమహిమ

చేతనో యన్నట్లు దినదినము నూతన భవనములు నిర్మిత మైనవి. ధనవంతులు వ్యయప్రయాసలకు సరకుచేయక యాఫ్రికాలోని యితరప్రాంతములనుండియు, ఐరోపాఖండము నుండియు, వివిధములగు ఫలవృక్షములను దెప్పించి తమ భవనములచుట్టును నాటిరి. అందుచే నుద్యానవన మధ్యస్థమై సుందరసౌధములతో నాకర్షణీయమై 'జోహాన్స్‌బర్గ్' నగరము నేత్రపర్వమై యొప్పారుచున్నది.

దక్షిణాఫ్రికాలోని యన్ని భాగములు వర్ణించుట నా భావము కాదు. మన గాథకు సంబంధించిన భాగములను మాత్రమే తీసికొందును. దక్షిణాఫ్రికాలో నొక భాగము మాత్రమే పోర్చుగీసువారి క్రింద నున్నది. పోర్చుగీసువారి క్రిందనున్న భాగమును 'డెలగోవాఘాత' మందురు. హిందూ దేశమునుండి వచ్చు నోడలకు దక్షిణాఫ్రికాలో నిది మొదటి రేవు.

మన మింకను దక్షిణముగఁ బోగా బ్రిటిషువారి మొదటి వలస దేశమైన 'నేటాలు' నకు వచ్చెదము. దీనికి ముఖ్యరేవుస్థానముకూడ నేటాలు పట్టణమే. కాని, 'డర్బాన్' నామాంతరముచేఁ బ్రసిద్ధి కెక్కినది. దీని రాజధాని 'పీటర్ మారిట్జుబర్గ్' పట్టణము. ఇది సముద్ర మట్టమునకు దాదాపు రెండువేల యడుగుల యెత్తున డర్బానుకు దక్షిణముగా నఱువది మైళ్ళ దూరమున నున్నది. చలి కొంచె మెక్కువగా నున్నను డర్బాన్‌యొక్క వాతావరణము బొంబాయి వాతావరణమువలె నుండునని చెప్పవచ్చును. నేటాలును దాటి

యింకను గొంచెము లోపలికిఁ బోయినచో 'ట్రాన్స్‌వాల్'
పట్టణమునకు వత్తుము.

ప్రపంచమంతటికిని మిక్కుటముగ బంగారు రాసుల
నిచ్చునది యీ పట్టణమందలి గనులే. బంగారుగనులేగాక
కొంతకాలము గడచిన వెనుక రత్నముల గనులుకూడా నిక్క
డనే కనిపెట్టఁబడినవి. ప్రపంచమునఁగల రత్నములలో నెల్ల
పెద్దదియగు 'కల్లినాన్' రత్న మిక్కడనే దొరికినది. గని
యొక్క యజమానుడు 'కల్లినాన్' అగుటచే నీరత్నమున కీ
పేరు పెట్టబడినది. రష్యాలోఁ బ్రసిద్ధిగాంచిన 'ఆర్‌లాఫ్'
రెండునూర్ల కారెట్ల తూకముగల రత్నము. మన 'కోహి
నూర్' రత్నపుఁ దూనిక యొక నూఱు కారెట్లు మాత్రమే.
కాని 'కల్లినాన్' రత్నము 3,000 కారెట్లు బరువు గల రత్న
రాజమై వెలయుచున్నది. పరిశ్రమల కేంద్ర మగుటచే
'జోహాన్స్‌బర్గు' మిక్కుటముగు సద్దుకల్గి కల్లోలముగ నుండును.
అందుచే రాజధాని కిది యనుకూలముగాదని భావించి 'ట్రాన్స్
వాల్'కు 'ప్రిటోరియా'ను రాజధానిగాఁ జేసిరి. 'ట్రాన్స్
వాల్'న కిది సుమారు ముప్పదిమైళ్ళ దూరమున నున్నది.
ఇచ్చట నుద్యోగులు, రాజకీయవేత్తలు, వారికి సంబంధిం
చినవారు మాత్రమే నివసించుచుందురు. ఇది 'జోహాన్స్
బర్గ్' వలెఁగాక మిక్కిలిఁ బ్రశాంతముగానుండును.' జోహాన్స్
బర్గ్' నగరవాసులు నడచుచున్నట్లు గాక పరుగెత్తుచున్నట్లు
కన్పింతురన్న నతిశయోక్తి కాదు. తక్కువ కాలములో
నెక్కువ ధనవంతుల మెట్లుగాఁగలమా యను తలంపుతో

నిండియుండురు. ఒకరితో నొకరు సంభాషించుటకుఁ గూడ వారికి వ్యవధి యుండదు.

మనము 'ట్రాన్స్‌వాల్' ను వదలి పడమరగా లోపలకుఁ బోయిన 'ఆరంజి ఫ్రీ స్టేటు'నకు వత్తుము. దీనిని 'ఆరేంజియా' యనిగూడ నందురు. 'బ్లూమ్‌ఫాంటెన్' అను చిన్న పట్టణము దీనికి రాజధాని. ఇది చాల ప్రశాంతముగా నుండును.

ఈ యారేంజియా నుండి కొలదిగంటలు రైలు ప్రయాణముచేసిన 'కేప్ టౌన్' సరిహద్దులకుఁ జేరుదుము. దక్షిణాఫ్రికాలోని యన్ని వలస దేశములకంటె నిది చాల పెద్దది. ఇదియే రేవు స్థానముగూడ నై యున్నది. "కేప్ ఆఫ్ గుడ్ హోప్" అని కూడ దీనిని బిలుతురు. పైనిఁ జెప్పఁబడిన ముఖ్యమైన నాలుగు వలస దేశములే గాక యూరోపావారికంటె ముందుగావచ్చి యితరులచే నాక్రమింపఁ బడిన పెక్కు ప్రాంతములు బ్రిటిషువారి రక్షణక్రింద నున్నవి.

దక్షిణాఫ్రికా మిక్కిలి సారవంతమైనది. ప్రధానముగా వ్యవసాయానుకూలమైనది. అందలి కొన్ని ప్రాంతములు పంటకాలమందు సస్యశ్యామలమై యత్యంత నేత్రపర్వముగ నుండును జొన్న ముఖ్యమైన పంట. ఇది ప్రయాసలేకుండఁ బండెడిపంట. దక్షిణాఫ్రికాలో నివసించు నీగ్రోల ముఖ్యాహార పదార్థ మిదియే. గోధుమలుకూడఁ బండును. నేటాలునం దుత్తమజాతి బత్తాయిలు, సీమరేగు, బొప్పాయి మొదలగు పలురకముల పండ్లు విశేషముగాఁ బండును. పంటల తరుణమం



ఖామారాజ్యము
బెచూనాదేశము
ప్రొటెక్టరేటు
బెలుదేశము
ప్రిటోరియా
జోహానసుబర్గు
గోషెన్‌స్టెల్లా దేశము
బెచూనాదేశము
వాల్‌నది
ఛార్లెస్‌టవున్
గ్రిక్వాదేశము
కింబర్లే
బ్లూంఫాంటీన్
ఆరెంజి
జూలాదేశము
లేడీస్మిత్తు
నేటాలు
పీటర్‌మారిట్జుబర్గు
డర్బన్
బసూటో దేశము
గ్రిక్వాదేశము తూర్పు
కేపురాజ్యము
క్వీన్సుటవున్
ఉంటాటూనది
కెయినది
కింగ్‌విలియమ్సుటవున్
గ్రేటుఫిష్‌నది
గ్రాహమ్సుటవున్
పోర్టుఎలిజబెత్
1
2
3
4
5
6
8
9
10
11
12
13
14
15
16

దవి బీదలకుఁగూడ నుచితముగ, పుష్కలముగా దొరకును. కేప్ కాలనీలో ద్రాక్ష, 'ప్లమ్' మొదలగు పండ్లు విరివిగాఁ బండును. అంతపంట మఱెక్కడను లేదని చెప్పవచ్చును. నిరుపేదలకుఁగూడ కరువులేకుండ దొరకును. భారతీయ సోదరుల కత్యంత ప్రియమగు మామిడిపండ్లుకూడ వారు వచ్చినపిదప విరివిగా నిచటఁ బండింపఁబడుచున్నవి. నేఁ డిచట బహురుచ్యమైన శాకాహారములకుఁ గూడ కొదువలేదు. ఇక్కడఁ బశుసంతతికూడ విశేషముగాఁగలదు. బలిష్టముగ నుండని జంతువొకటి కూడ నిచట మచ్చునకైనఁ గానరాదు.

అంతకంటె మించినది "కేప్" నగరము. ఇది యత్యున్నతమునుగాక, యతినిమ్నమునుగాక సమప్రదేశముగా నుండు 'టేబుల్' పర్వత పాదమునొద్ద నిర్మింపఁబడియున్నది. చదునైన యీ పర్వతప్రాంతము బహుసుగంధ పుష్పలతాదులతో నిండియుండి కనుల పండువుగ నుండును. సముద్రము నిత్యము పాదప్రక్షాళన మొనర్చుచు నీ నగరమును మఱింత ముచ్చటగాఁ జేయుచున్నది.

దక్షిణాఫ్రికాయందు గంగా, యమునా, సింధుల వంటి గొప్ప నదులు లేవు. కొలఁదిపాటి నదులు మాత్రమే కలవు. దేశమంతటికిని దగిన నీటి నీయఁగల నదులు లేకపోవుటచేఁ బ్రభుత్వమే పెద్దపెద్ద బావులను త్రవ్వించి కర్షకులకు మిక్కుటముగ సహాయపడుచున్నది. లోతైన నూతులనుండి యంత్రములవలన నీటినితోడి సేద్యమున కుపయోగింతురు.

భూమధ్యరేఖకు దక్షిణముగ దక్షిణాఫ్రికాయును, నుత్తరముగ హిందూదేశమును నుండుటచే రెండింటి శీతోష్ణ స్థితు లొకదానికొకటి భిన్నముగ నున్నవి. ఋతువు లొకదానికొకటి వ్యతిరేకము. మనకు వేసవికాల మారంభమైనప్పుడు దక్షిణాఫ్రికాలోఁ జలికాలము ప్రవేశించును. వర్షపాత మనిశ్చితము, క్రమము తప్పియు నుండును. ఎప్పుడైనను బడవచ్చును. లేకపోవచ్చును. సంవత్సరములో సగటున నిరువదంగుళములకంటె వర్షము మించదు.



# 2 వ అధ్యాయము

## చరిత్ర

క్రిందటి యధ్యాయములో మనము తెలిసికొన్న భౌగోళిక విభాగములు పురాతనమైనవి కావు. ఆదిమ నివాసులెవరో నిర్ధారణచేయుట యసంభవము. మొదట దక్షిణాఫ్రికాలో 'యూరోపియనులు' నివాస మేర్పఱచు కొన్నప్పుడు నీగ్రో లుండిరి. అమెరికావారి యతిదారుణ దాస్యబంధము నుండి యెట్లో తప్పించుకొని బయటఁబడి యాఫ్రికాకు వలస వచ్చిన కొంతమంది బానిసల సంతతియే యీ నీగ్రోలని యూహింపఁబడుచున్నది. వారిలో వివిధ భాషలు మాట్లాడు

'జాలూాలు', 'స్వాజీలు', 'బసుటాలు' మొదలగు జాతులు కలవు. ఈ నీగ్రోలనే దక్షిణాఫ్రికాలోని యాదిమ నివాసులుగఁ బరిగణింపవచ్చును. దక్షిణాఫ్రికా యిప్పుడు నివసించుచున్న నీగ్రోలసంఖ్యకు దాదాపు ముప్పదిరెట్ల జనసంఖ్యను బోషింపఁగలంత మహాఖండము. 1914వ సంవత్సరములో నీ మహాఖండమున నీగ్రో జనసంఖ్య యేబది లక్షలు. అన్ని జాతుల యూరపియనులసంఖ్య కలసి వర్ధిల్లుచుండెను ర లక్షలు మాత్రమే.

జూలూాలు నీగ్రోలలో కెల్ల మిక్కిలి పొడగరులు, మిగుల నందమైనవారు. యూరపియను నాగరకత రాక పూర్వము నీగ్రోలు చర్మములను ధరించుచుండెడివారు. చర్మములే వారి పడక కుపయోగించు వస్త్రములు. చర్మములే వారి తివాసీలు. బ్రిటిషువారిపాలనకు పూర్వము నీగ్రో స్త్రీపురుషులు దాదాపు దిగంబరులుగనే తిరుగుచుండెడివారు. నీగ్రోల కొకరివంక నొకరు కామవికారముతోఁగూడిన చూపులు చూచుకొను స్వభావముకూడ లేదు. నీగ్రోలు కేవల మనాగరికులని భావించుటకు హేతువు మన పటాటోపమే. మన మూహించుచున్నట్టి యనాగరికులు వారు కారు. పట్టణములకువచ్చు స్త్రీలు రొమ్మునుండి మోకాళ్ళవఱకును, బురుషులు నడుమునుండి మోకాళ్ళవఱకును బట్టలుకప్పుకొనునట్లు బ్రిటిషువారు శాసనము చేసిరి. అందుచే నిప్పుడు నీగ్రో స్త్రీ పురుషులు బట్టలను క్రమక్రమముగ దుప్పట్లను, జముకాణములను, మిక్కుటముగఁ వాడు

చున్నారు. అందుచే యూరపియను వర్తకులు వారివారి దేశములనుండి యీ దుస్తులు దిగుమతిచేసి వ్యాపారమును సాగించుచున్నారు.

శరీర పాటవమునందును, నవయువ పటుత్వమునందును ప్రపంచములోని యేజాతికిని దీసిపోని యీ జాతి యొక్క శ్వేతబాలకుని జూడఁగనే భయ కంపితులై పోవుదురన్న శాకకులు విస్మయ భరితులగుదురు. ఎవరైన ఒకరివాల్వరును నీగ్రోమీఁదకు గురిపెట్టినచో నతఁడు పారిపోనైనఁబోవును. లేదా నిశ్చేష్టుఁడై నిలవఁబడియైనఁ బోవును. దీనికి ప్రబలకారణముగలదు. కొలదిమందియూరపియనులు తమజాతివంటి పెద్దజాతినంతటి నేదోయొక మంత్రమహిమచేతనే లోఁబఱచుకొని కట్టుబాటులలోఁ బెట్టగల్గుచున్నారను భావము వారి మనస్సులో గట్టిగా నాటుకొనిపోయినది. నీగ్రోలు విల్లంబులను జక్కగా బ్రయోగించుటయందు నేర్పరులే. కాని వారికివి లేకుండఁ జేయబడినవి. తుపాకినిగాని, రివాల్వరునుగాని ప్రేల్చుటమాటయటుంచి చూచియే యెఱుఁగరు. నిప్పునుగాని, నిప్పుపుల్లనుగాని వెలిగింపకుండ నొక గుండీవంటి దానిని మీటుటతోడనే పెద్దధ్వనితో మెఱుపువలె వచ్చిపడి మానవుని ప్రాణమును క్షణములోఁదీయుట యతనికి నూహాతీతమైన చిత్రముగనున్నది. అందుచే నట్టి యాయుధ ధారులను జూడగనే ప్రాణభీతితోఁ జకితుఁడై నిలువఁబడి పోవుచున్నాడు.

నిరాడంబరులును, నమాయకులును నైన యీ నీగ్రోలు నివసించునట్టి యీ దేశమున సుమారు నన్నూరు సంవత్సరముల క్రింద డచ్చివారు వచ్చి నివాసమేర్పఱచుకొనిరి. "కేప్ కాలనీ" అని పిలువఁబడున దిదియే. కొంతమంది మలయా దేశపు బానిసలను డచ్చివారు, వారివెంట తీసికొని వచ్చిరి. ఈ మలయాలు మహమ్మదీయులు. వారిలో డచ్చి దేశీయుల రక్తము ప్రవహించుచున్నది. వారి లక్షణములు కూడ సంక్రమించినవి. మంచి కష్టజీవులు. తెలివిగల జాతి. స్త్రీలుకూడ సర్వవిషయములలోను బురుషులతోపాటు సమ ర్థురాండ్రు. ఉన్నతవిద్య నభ్యసించు నవకాశములున్న నెంత యుచ్చస్థితికైనను రాగలరనుటకు డాక్టర్ రహమానువంటి కొంతమంది మలయను పార్లమెంట్ సభ్యులే తార్కాణము.

డచ్చివారు చాలఁ దెలివిగలవారు. ధైర్యశాలులైన యోధులు. నేర్పరులైన వ్యవసాయకులు. ఏ విషయములోను స్త్రీలు పురుషుల కేమాత్రము తీసిపోరు. తా మాక్రమించిన భూములన్నియుఁ జాల సారవంతమైనవనియు, వ్యవసాయ యోగ్యమైనవనియు వారు కనిపెట్టిరి. ఆదిమవాసులు సంవ త్సరములోఁ గొలఁదికాలము కష్టించిన సంవత్సరమంతటికిని సరిపోవు గ్రాసమును తేలికగఁ బండించి జీవింపఁగలరని కని పెట్టిరి. నట్టివో మిగత వత్సరమంతయుఁ దమకై శ్రమపడి పనిచేయునట్లు వారినేల నిర్బంధింపఁ గూడదని డచ్చివారు భావించిరి. తమ స్వార్థమునకై తా మవలంబించు నీట్టి పద్ధతులు తమ మతమునకు విరుద్ధములు కావని వారు భావిం

తురు. అందుచే సర్వోపాయముల నుపయోగించి యాదిమ వాసులసహాయమున వ్యవసాయమును సాగించిరి. వారి యా చర్యలందలి నీత్యవినీతులనుగూర్చి వారికి శంకయే లేదాయె.

మంచి భూములకై యన్వేషించుకొనుచు, నాక్రమించు కొనుచు డచ్చివారు ముందునకు బోవుచుండ వారి వెను వెంటనే వచ్చిన యాంగ్లేయులును నదేవిధముగ వలస దేశముల విస్తరణమునకై వెదకుచు బయలు దేఱిరి. వారును వీరును నొక్క సంతతి రక్తమును పంచుకొన్నవారే. ఉభయుల యాశలు, నాశయములు సాధారణముగా నొకటిగనే యుండును; ఒకే 'కుమ్మరావము'లోని ముంత లొకదానితో నొకటి తరచు సంఘర్షించునట్లు దేశాక్రమణకాంక్షావశులై వలసవచ్చినవీరిరువురకు ననేకసందర్భములలో సంఘర్షణ తప్ప లేదు. ఆంగ్లేయులకును డచ్చివారికిని 'మజుబా' కొండవద్దజరిగిన సంఘర్షణయం దాంగ్లేయులోడిపోయిరి. ఇదియే వారిమధ్య తీవ్రకక్షలకు దారితీసినది. 1899 సంవత్సరమునుండి 1902 వ వర్షము వఱకు జరిగిన బోయరు యుదమున కిదియే మూల బీజము. ఈబోయరు యుద్ధమునకు పూర్వమే కొన్ని సంఘ ర్షణలు జరుగుటచేఁ బరిస్థితులను గ్రహించిన కొంతమంది బోయరు లింగ్లీషువారి పాలనక్రింద నామమాత్రముగనైన నుండుట కిష్టములేక దక్షిణాఫ్రికాలోని యగమ్యములైన లోపలి భాగములకుఁ బోయిరి. 'ట్రాన్స్వాల్' 'ఆరంజి ఫ్రీస్టేటుల' పుట్టుక కిదియే మూలము. ఈ డచ్చివారే యాఫ్రి కాలో 'బోయరు'లని పిలువఁబడుచున్నారు.

# 3 వ అధ్యాయము

## భారతీయుల ప్రవేశము

క్రిందటి యధ్యాయమున నాంగ్లేయులు నేటాలును
ఆక్రమించుటనుగూర్చి తెలిసికొంటిమి. వారి నెప్పుడును
కొట్టినది కూలీలసమస్య యొక్కటియే. జూలూలను సామ,
దాన, భేద దండోపాయము లెన్నియో ప్రయోగించి లొంగ
దీయఁ బ్రయత్నించిరి కాని వారు లొంగలేదు. వారినుండి
కొన్ని సదుపాయములను సంపాదించగల్గిరే గాని వారిని వశ
పఱచుకొని బానిసలుగాఁ జేసికొని పనిచేయించుకొనలేక
పోయిరి. దక్షిణాఫ్రికాలోఁ జెఱకు, కాఫీ, తేయాకు తోటల
యభివృద్ధి కపారావకాశములు కలవు. కాని వలసవచ్చిన
యీ కొలదిమంది యాంగ్లేయు లేమిపని చేయగలరు? ఏమి
సాధింపగలరు? ఇట్టిపరిస్థితులలోఁ గూలీల సమస్యాపరిష్కార
మునకై వారి దృష్టి పరాధీన భారతదేశము వైపునకు మఱలి
నది. వారి యాంగ్లేయసోదరులేగదా పరిపాలకులు! ఇంక వారి
కేమి కొదువ? కూలీల నొడంబడిక పద్ధతిమీఁద వలస పంపు
మని యా పాలకులసహాయ మర్థించిరి. రాజులు తలఁచుకొన్న
దెబ్బలకేమి కొదువయన్నట్లేదో యొక విధముగ మాయో
పాయములు ప్రయోగించియు; నాశలు కల్పించియు భారత
దేశపుఁ గూలీల జట్టుల నెట్టకేలకధికారులు దక్షిణాఫ్రికాకుఁ
బంపిరి. ఈ యొడంబడిక పద్ధతి కూలీలనే Indentured

Labourers' అందురు. 1860 వ సంవత్సరము నవంబరు 16వ తేదీని భారతదేశపు బానిసకూలీల జట్టు ఆఫ్రికాకుఁ జేరినవి. ఆంగ్ల పరిపాలకులీ చర్యతీసికొననిచో మనసోదరుల కీయిక్కట్లు గాని, సత్యాగ్రహావసరముగాని లేకుండఁ బోయెడిది. ఆంగ్లో ద్యోగులు వారి సోదరులయెడ పూర్తిగాఁ బక్షపాతమునుజూపి క్రమక్రమముగాఁ గూలీలను వలసవంప మొదలిడిరి. కూలీల క్షేమమున కని యేవో కొన్ని షరతుల నొడంబడిక పత్రము లందుఁ జేర్చినమాట నిజమేయగుఁగాక! కాని, యిండ్లు వాకిండ్లు విడిచి వేలకొలఁది మైళ్ళ దూరదేశములకు వలస పోయి నివసించు నిరక్షరాస్యులై నోరులేని యీ కూలీలు వారికేమైన బాధలు వచ్చినప్పు డెట్లు నివారించుకొందురు? వారి గతియేమి కానోపుఁనని యోచించినవారు లేరాయె. వారి మత నైతికావశ్యతలనుగూర్చిగాని వారిని రక్షించు మార్గములనుగూర్చి కాని యోచించువారులేరైరి. చట్టరీత్యా ఆఫ్రికాలో బానిసతనము నిర్మూలింపఁబడినను యజమానులు తమ సేవకులను ద్రొక్కిపెట్టి యూడిగముచేయించుకొనఁగోరు చుందురన్న సామాన్య విషయమునుగూడ బ్రిటిష్‌ఉద్యోగులు మఱచిపోయిరి. ఐచ్ఛికముగ నొడంబడికమీఁదనే పోయి రని యెంత చెప్పినను వారు యథార్థమునకు బానిసలేగదా! నేటాల్ దళారుల మాయమాటలలోఁ బడి వచ్చి యిక్కడ నెట్టిపాట్లు పడవలసివచ్చినదో, యమయాతనల ననుభవింపవలసి వచ్చినదో, యెట్లు వారు మతదూరులును, నవినీతిపరులును, నిగ్రహశూన్యులును గావలసి వచ్చినదో గృహస్త్రీలకును, పడుపుగత్తెలకును, భేదములేకుండ నెట్లు

పోయినదో వ్రాయఁబూనుకొన్నచో మహాగ్రంథ మగును.
ఇంతవరకు నిది కూలీల గాథ.

ఇంక వర్తకులవిషయము విచారింతము. ఈకూలీలతో
సంబంధముగల భారతీయవర్తకులు వారివారివ్యాపారములు
సాగించుకొనుటకై దక్షిణాఫ్రికాకు రా మొదలిడిరి. కీర్తిశేషు
లైన 'అబూబకార్' వీరిలో నొకరు. ఆయన నేటాలులో
నొక యంగడిసిబెట్టి వ్యాపారము సాగించెను. కాని, యక్కడి
యాంగ్లేయులు భారతీయవణిక్ప్రముఖు లెంతటి సమర్థులో
ప్రప్రథమమున నూహింపరైరి. వారికి లక్ష్యముగూడలేకుండెను.
వలసకూలీల సహాయమున వారు విరివిగాఁ జెరకు, తేయాకు,
కాఫీ తోటలను వేసి యపారమైన లాభములు పొంద మొదలు
పెట్టిరి. కొలఁదికాలములో మహాధనవంతులైరి. రాజభవన
ములను నిర్మించుకొనిరి. మహాటవి నొక రమ్యమైన యారామ
ముగాఁ జేయగల్గిరి. అందుచే 'సేట్ అమద్' వంటివా రొక
రిద్దరు వారిమధ్యఁజేరి వ్యాపారము చేయుచుండుట వారు
గమనింపరైరి. సేట్ వ్యాపార మందుచే చక్కగా సాగి
యచిర కాలములోనే యైశ్వర్యవంతుఁ డాయెను. ఈయన
సంపాదించిన భూఖండములను గూర్చియు, నైశ్వర్యమును
గూర్చియు గాథలాయన స్వదేశమునకు, స్వగ్రామ ప్రాంత
ములకు వినవచ్చినతోడనే చాలమంది కాళ్లు రేకెత్తినవి.
వారును బెక్కురిక్కడకు వలసవచ్చి వ్యాపారము సాగింప
మొదలిడిరి. వారి వెనువెంటనే యవసరమైన గుమస్తాలు
క్రమ క్రమముగఁ జేరిరి. ఇట్లు భారతీయుల సంఖ్య దినదినాభి
వృద్ధి కాసాగెను.

ఇప్పుడు మూడువర్గముల భారతీయు లిక్కడ నివసింప సాగిరి. వ్యాపారము చేసికొను స్వతంత్ర వర్తకులు, వారి యుద్యోగులు నొకవర్గము. వలసవచ్చిన కూలీలు కాల క్రమమున వృద్ధికి వచ్చిన వారిసంతతి రెండవవర్గము. ఒడంబడికలోని కాలపరిమితి దాటిపోయి స్వతంత్రులైన కూలీలు మూడవవర్గము. వాస్తవమునకు వీరు స్వతంత్ర ముగా నెవరియొద్దనైనను గూలి చేసికొనవచ్చును. వ్యాపా రము చేసికొనవచ్చును సేద్యము చేసికొనవచ్చును. స్వేచ్ఛగా నివసింపవచ్చును. లేదా స్వదేశమునకుఁ దిరిగి పోవచ్చును. కాని, యిక్కడి పరిస్థితులు దీనికి విరుద్ధముగ నున్నవి. స్వతంత్రభారతీయు లనుకొనువారికున్న హక్కులు వీరికి లేవు. ఒక దేశమునుండి మఱియొక దేశమునకుగాని ,యొక యూరి నుండి మఱియొక యూరికిఁగాని పోవలెనన్న వీరికి స్వేచ్ఛ లేదు. అన్నియు నభ్యంతరములే. వారు చేసికొన్న వివాహ ములుకూడ సక్రమముగఁ బరిగణింపఁ బడవలెనన్న వారు 'వలస భారతీయరక్షకుఁ'డను నాఫీసరుకడకుఁబోయి నమోదు చేసికొనవలెనఁట. ఇంక నిట్టి వనేక నిర్బంధములకు, నవ మానములకు నిత్యము వారు గుఱికావలసి వచ్చుచుండెడిది.

కూలీలస్థితి యిట్లుండ భారతీయవర్తకుల స్థితిమాత్రము కొంచెము ప్రోత్సాహకరముగ నుండెను. యూరపియను వర్తకులు నీగ్రోలను, వలసవచ్చిన కూలీలను గుక్కలకంటె హీనముగాఁ జూచుచుండెడివారు. రూపాయకు పావలా వస్తువు లిచ్చి మిన్నకుండెడివారు. తక్కినడబ్బు నడిగినఁ

దన్నులు, తిట్లు పరిపాటియైపోయినవి. అట్లు తప్పినచో నది యదృష్టముగా నెంచబడుచుండెడిది. యూరోపియను వర్తకు లందఱు నిట్టివారే యని చెప్పుట నా భావము కాదు. కాని, సర్వసాధారణముగ నిట్టిసంఘటన లెక్కువ జరుగుచుండెడివి. దీనికి విరుద్ధముగ భారతదేశపు వర్తకులు సౌమ్యముగా మర్యాదగా బ్రవర్తించెడివారు. అందుచే నీగ్రోలు వలస కూలీలు వీరియొద్దఁజేరి కాతాలు యేర్పఱచుకొనుచుండెడి వారు. ఈ విధముగ వీరి వ్యాపారము విరివిగఁ బెరిగిపోసాఁగెను. ఆ రోజులలో మంచిలాభమును సంపాదించుట కవకాశములు నధికముగా నుండెడివి. అందుచే దక్షిణాఫ్రికాలోని యన్ని వలసదేశములలోను, భారతీయులు ప్రవేశించి వాణిజ్య వ్యవసాయములను సాగించి దినదినాభివృద్ధి పొందుచుండిరి. బోయరులునుకూడ భారతీయవర్తకుల తోడనే వ్యాపార సంబంధములు వృద్ధిచేసికొనుచుండెడివారు. పూర్ణ స్వాతంత్రులైన భారతీయుల సంఖ్య మన చరిత్రకాలమునాటికి నలుబది యేబది వేల మధ్యకుఁ బెఱిగినది. కాలపరిమితి దాటిన కూలీల సంఖ్య దాదాపు లక్షకుఁ బెఱిగినది.

---

# 4 వ అధ్యాయము

## కష్టముల సమీతు

నేటాల్ లోని యాంగ్లేయవర్తకులు తమకు సేవఁజేయు బానిసలనే కావాలని కోరుకొనుచుండిరిగాని తమతో నన్ని వృత్తులలోను పోటీపడఁగల వర్తకులనుగాని కూలీలనుగాని కోరుకొనుటలేదు. ఈ వర్తకుల యభివృద్ధి భారతదేశపుఁ గూలీల పెంపు చూడఁజూడ వారికిఁ గంటకమై కన్నుఁ గుట్టెను. అదివఱకు నరుదుగా దొరకెడు కూరగాయల నిప్పుడు విరివిగా బండించి, సంపాదించి కూలీలుకూడ స్వేచ్ఛగ సుఖముగ జీవించుట, యభివృద్ధిగాంచుటఁ జూడ వారి భయకంప మగ్గల మాయెను. దేశమంతయుఁ దమకే గుత్తగ భావించిన యూరపియనులు భారతీయులసంఖ్య వృద్ధియైనఁ దమగతి యేమి కానోపునని తలంచి వెఱ్ఱెత్తిపోయిరి. తమ తోఁటపనులు, వ్యాపారములు క్రమముగ, నిర్విఘ్నముగ సాగింపఁగోరి యీ యూరపియను వర్తకులు భారతదేశమునుండి యసంఖ్యాకముగఁ గూలీలను గావలెనని యొకవంక నొత్తిడి చేయుచు మఱియొకవంక నక్కడ నివాసమేర్పఱచుకొనెడి కూలీలను, భారతీయ వర్తకులను దఱిమివేయ సంకల్పించి వేయివిధముల హింసింప మొదలిడిరి. కూలీలు తెలివితో శ్రమపడి చేసిన కఠినసేవకు బహుమతి కాబోలు నిది! ఆందోళనపరులైన యూరపియను లిక నూతనముగ వలసవచ్చు కూలీల యెడం

బడికలలో నొక క్రొత్త నిబంధనను చేర్చ మొదలిడిరి. అనగా గాలపరిమితి దాఁటినవెంటనే మఱల దాస్యముచేయుట కొడం బడిక పత్రమును వ్రాసియిచ్చిన దప్ప వారు స్వదేశమునకు దిరిగిపోవలెనఁట! ఇంక నేవియో నిబంధనలఁగూడ విధింప మొదలిడిరి.

మరియొకవర్గము వారు తలపన్ను, ఇంటిపన్ను విధించి వారి జీవితమును దుర్భరముచేసి పాఱిపోవునట్లు చేయవలెనని యాందోళనచేయ మొదలిడిరి. ఈ యాందోళన మత్యంత తీవ్రరూపము దాల్చుటచే నేటాలుప్రభుత్వ మొక విచారణ సంఘమును విధిలేక నియమించినది. కాని, యనుచిత మైనట్టియు, నన్యాయమైనట్టియు వారి వాదనలకు బలము లేకపోయెను. మిాదుమిక్కిలి స్వతంత్రులును, స్వేచ్ఛా ప్రియులు నగు వారిసాక్ష్యము లిందులకు విరుద్ధముగ గూలీల యునికి దేశసంపదకు, శ్రేయస్సున కవసరమని ఋజువుచేసినవి. ఈ విచారణ భారతీయులకే అనుకూలమైనది. ఆందోళన వ్యర్థమైనది. కాని, యంతటితో యూరపియను లాగుదురా? నేటాలు ప్రభుత్వము వారిచేతులలో నుండుటచేతను, తోఁట యజమానులు వారి మిత్రులే యగుటచేతను నీ యుభయ పక్షముల వాదములను విపులముగ భారత ప్రభుత్వమునకు బంపునట్లు చేసిరి కాని, భారత ప్రభుత్వమువారు వెంటనే యీ యక్రమవాంఛల నంగీకరింపరైరి. ఏలయన నీ భారత దేశపుఁ గూలీలను ప్రభుత్వమువారు పంపునప్పుడు కాల పరిమితి దాటఁగనే వారు స్వతంత్రు లగుదురనియు, నిష్ట

మైనచో నచటనే నివసించి వ్యాపార వ్యవసాయములు చేసి కొని సుఖముగా జీవింప నెట్టి యభ్యంతరముండదనియుఁ జెప్పి నమ్మించి పంపుచుండెడివారు. ఇప్పుడిట్లు నేటాల్ ప్రభుత్వ చర్యలనుగాని యూరపియనుల యాందోళనను గాని మన్నించినచో భారతప్రభుత్వమువారు లోకమున నపకీర్తి పాలగుదురు. అందుచే వారికోర్కెలను దిరస్కరించిరి.

అందువలన యూరపియనులు తమయాట నిరాటంకముగఁ గొంతవఱకైన సాగఁవలెనన్నఁ దమదేశమున బాధ్యతాయుతప్రభుత్వమును స్థాపించుకొనుట మంచిదని భావించిరి. అందుకై పెద్ద యాందోళన నారంభించిరి. ఈ యాందోళన ఫలితముగ 1893 వ సంవత్సరము నాఁటికి బాధ్యతాయుత ప్రభుత్వము వారికి బ్రసాదింపఁబడెను. ఇంక వారి కేమి కొదువ? వారి కిష్టమొచ్చిన ఘోర చట్టములను బాధ్యతాయుత ప్రభుత్వము పేరిట జేయ సమకట్టిరి. ఒక్కొక్క కూలీ కుటుంబమున కొకసంవత్సరమున కిరువదియైదుపౌనుల పన్నును విధింప సమకట్టిరి. రు 375 ల పన్ను చెల్లించి కుటుంబమును వా రెట్లు పోషింపఁగలరు? అందుచే భారత ప్రభుత్వ మడ్డు వచ్చి దీనిని రు 75 లకుఁ దగ్గించినది. ఈ మొత్తమునుగూడ బాప మా కూలిసోదరు లెట్లు భరింపగలరు? ఆఱుమాసముల పైఖర్చు నిది మ్రింగివేయును. ఇందుఁగూడ నొకచిత్రమైన మోసముఁ జేసిరి. ఈ డెబ్బదియైదు రూప్యముల పన్ను తల యొక్కంటికని యర్థము చేసిరి. పదునాఱువత్సరములు దాఁటిన మగబిడ్డలకును, పదమూడువత్సరములు దాటిన యాడుబిడ్డల

కును, యజమానునకును, నతని భార్యకును నిది చెందునట్లు చేసిరి. ఈ దారుణమైన పన్నులవిధానము మనకూలీల నెంత క్షోభ పెట్టినదో యనుభవించెడివారికే తెలియగలదు. చూచువారికి గొంతవఱకర్థముకాగలదు. దేశభక్తులును భారమార్థికులు నగు భారతీయవర్తకులు కొంతమంది వీరితరఫున బెద్దయాందోళనచేసినను కొలదితగ్గింపులు జరుగుటయేకాని పూర్తిలాభము లేక పోయెను. పావ మా నోరులేని పాటక జనమున కిదంతయు నేమి తెలియును ?

కానిసకూలీలస్థితి యిట్లుండ స్వతంత్రభారతీయుల స్థితి కూడ దుర్భరముగనే యుండెను. నేటాల్ లోని యూరపియను వర్తకులు భారతీయ వర్తకులమీదఁగూడ ధ్వజ మెత్తిరి. ఇప్పటికే భారతీయు లన్ని వలసప్రాంతములలోను బాగుగాఁ బాతుకొనిపోయిరి. భాగ్యవంతులైపోయిరి. ఇంక నూరకున్న తమను మించిపోవుదురని వారు భావించిరి. మఱియు పార్లమెంటుసభ్యులగుటకు హక్కులుండుటచే వారి ప్రతిష్ఠ పలుకుబడి హెచ్చునని 'ఓటుహక్కు' అసలే లేకుండఁ జేయఁ జూచిరి. కాని, బ్రిటిష్ సామ్రాజ్య రాజ్యాంగ మూలసూత్రములకు వర్ణవివక్షతను చూపు శాసనములు విరుద్ధము లని బ్రిటిషు ప్రభుత్వము త్రోసివేసెను.

కాని, వారివంతము నెగ్గించుకొనుటకై యా బిల్లును మానివేసి పైకి వర్ణవివక్షత కన్పించకుండ మఱి రెండు శాసనములను నేటాల్ ప్రభుత్వము చేసినది. ఒకటి 'వలస నిరోధచట్టము' రెండవది 'లైసెన్సుచట్టము,'. మొదటిది

దేశాగమనము నరికట్టుచున్నది. రెండవది లైసెన్సు లేని దే వ్యాపారముచేయ వీలులేదని శాసించుచున్నది. మొదటి శాసనము ననుసరించి యాంగ్ల విద్యలో నొక పరీక్ష పెట్టి యందు కృతార్థులైనవారికే నేటాలులోఁ బ్రవేశింపవీలగునట్లు చేసిరి. రెండవచట్టపు నిబంధనల ననుసరించి లైసెన్సుల నిచ్చు నధికారి నేర్పఱచిరి. తెల్లవారికిఁ గోరినంత లైసెన్సు లెన్నియైన వచ్చి పడుచుండెడివి. కాని, మనవారికట్లుకాదు. ఓపిక యున్నవారొక న్యాయవాదిని బెట్టి ప్రయత్నము చేయ వలయును. ఇంతచేసిన నీయవచ్చును. లేక యేదోయొక నెవమున లైసెన్సు నీయకపోవచ్చును. శక్తిలేనివారికి న్యాయ వాదిలేడు. లైసెన్సులు లేవు. వ్యాపార మసలే లేదు. ఎంత విపరీతమో చూడుఁడీ! ఇవ్విధముగ వారువీరన నేల? ఆ దేశ మీ దేశమన నేల? అన్ని వలస దేశములలోను భారతీయవ్యతి రేకత యను నీ యంటువ్యాధి కొంతవఱకు వ్యాపించి పీడింప మొదలిడినది. వీరి న్యాయమైన యన్ని హక్కులను మంటఁ గల్పి కాల్క్రిందఁ ద్రొక్కిపెట్టి యుంచుకొనవలెననెడి యుద్దేశమే వీని కన్నింటికిఁ గారణము. ఈ చట్టమునకు బూర్వము మూఁడువత్సరము లాదేశమునఁ గాపురముండి పోయినవారు మాత్రే మీ పరీక్షతో నిమిత్తములేకుండఁ దిరిగిరావచ్చునట. ఇట్లు శాసనములవలనను, నితరవిధములుగను భారతీయులనేక బాధలకు ననర్హతలకు గుఱియగుచుండెడివారు. పైగాధ నేటా లునకు సంబంధించినది.

ఇట్లే 'ట్రాన్సువాల్' మొదలగు నితరములగు వలస దేశములలోఁగూడ 1880 నాఁటికి యీ విషబీజములు

నాటుకొనెను. ట్రాన్సువాల్ డచ్చివారి ప్రజారాజ్యము. అందుచే నక్కడి బ్రిటిష్ ఇండియను పౌరస్వాత్వములను ప్రెసిడెంటు 'క్రూగర్' ద్వారా సంపాదించుటకై రాయబార వర్గముద్వారా ప్రయత్నముఁ జరిపిరి. ఇది బహు పరిహాస పాత్రముగాఁబరిణమించెను. ప్రెసిడెంటు క్రూగరు ప్రవర్తన యీసందర్భమున జాల అమర్యాదగను, చిత్రముగ నుండెను. ఆయన యీ రాయబార వర్గమును యింటిలోనికిఁగూడ రానీయక బయటనిలువఁబెట్టి యీవాక్కులుపల్కెను. 'మీరు ఇస్మాయిల్ సంతతికి జెందినవారు. అందుచే మీరు పుట్టుక చేతనే ఈసయా సంతతివారికి బానిసలుగా నుండి యూడిగము చేయ బద్ధులై యున్నారు అందుచే మాతో సమాన ప్రతిపత్తికిఁగాని, హోదాలకుఁగాని, హక్కులకుఁగాని మీరర్హులని మేము భావింపము' ఇది యాయన చిత్రమైన సమాధానము. ఈ విషయమును 'మార్లే' ప్రభువుగారికి నివేదింపఁగా వారు 'ట్రాన్స్‌వాల్' ఇప్పుడు బ్రిటిష్ సామ్రాజ్యంతర్గతాధి నివేశ మనియు, వారి కేదైన సలహామాత్ర మీయగలము గాని యంతకంటె మించి యధికారము లేదనియు నేవో కొన్ని యౌదార్యమాటలను జెప్పి రాయబారవర్గమును బంపివేసిరి. భారతీయుల ఆందోళనాఫలితముగను, బ్రిటిష్ ప్రభుత్వము వారి యభ్యంతరముచేతను చట్టమునం దేదో కొద్దిపాటి సవరణ జరిగెను. ప్రభుత్వమువారిచే నిర్ణయింపఁబడిన ప్రాంతములలోనే భారతీయులు స్థలములు కొనవచ్చునఁట! వ్యాపారము చేయవచ్చునఁట! యెంత చమత్కారమో చూడుడు? 1875 వ సంవత్సరము 3 వ చట్టసంబంధమైన నిబంధనల

ప్రకారము వ్యాపారము సాగింపగోరు ప్రతి భారతీయుఁడు రు 375 లు ఖర్చుపెట్టి నమోదు చేయించుకొనవలెనఁట! ఎన్ని భారమైన యపరాధపుఁబన్నులు భరింపవలసివచ్చెను! వారి పౌరస్వాత్వముల ననుభవించుటకై యెుక యంగుళపు భూమినిగూడ సంపాదింప వీలులేకుండఁ జేయఁబడెను. ఈ నిబంధనలన్నియు నింతవిడ్డూరముగ నుండుటచే ట్రాన్స్వాల్ ప్రభుత్వ ముచితమైన కారణములను జూపి సమర్థింప లేకపోయెను. ఒక విచారసంఘమును నియమించి క్రొత్త తంతును నడిపి 188 వ సంవత్సరములోఁ గొంత సవరణను చేసినది. నమోదు (రిజిష్టరు) ఖర్చును 25 పౌనులనుండి 3 పౌనులకు తగ్గించినది. వా రంగీకరించిన స్థలములం దే వ్యాపారము సాగింపగలరని యింతకుముం దే తెలిసికొంటిమి. వారంగీకరించిన స్థలములు పట్టణమునకు వెలుపల నెచ్చటనో యుండును. నీటి సౌకర్యము లుండవు. పరిశుద్ధత లేక ము ఱికి కూపములై యుండును దీపసౌకర్యము లసలే యుండవు. మానవ నివాస యోగ్యములుగాక యరణ్యముగనుండును. ఈచట్టముల వ్యాఖ్యానబాధ్యతఁగూడ ప్రభుత్వ న్యాయసంఘముల దేనట. ఇంకఁజెప్పవలసిన దేమున్నది. 'ఆరెంజిఫ్రీస్టేటు' లోని స్థితిగతులుకూడ నింతకంటె భిన్నములు కావు.

'కేప్ కాలనీ'లో మాత్రము పరిస్థితులు కొంచెము మెఱుగు. ఇక్కడ కొన్ని ప్రత్యేక కారణములు కలవు. బోయరు జాతితో మొదటినుండి వచ్చియున్న మలయా మహమ్మదీయులుకలరు. వేషభాషలతో బోయరులనే యనుక

రించెడివారు. వారు దచ్చి దేశీయులే. అందుచే వారికి వ్యతి రేకముగా కఠినశాసనములు చేయుటకు డచ్చివారి కిష్టము లేకుండెను. ఈ కారణములచే కేప్ దేశము వర్ణవివక్షత విషయములో నంత దురాగతముగ లేకుండెను. కేప్ కాలనీ దక్షిణాఫ్రికాలోఁ బురాతనమైనదగుటచేతను, విజ్ఞానమునకు, సంస్కృతికి కేంద్రమగుటచేతను పెద్దమనుష్యులు, విశాల హృదయులు, సౌమ్యులు నిచట జన్మించిరి. సరియైన విద్య, సరియైన శిక్షణ నిచ్చినచో యోగ్యులను సృష్టించుటలో నే దేశమును వెనుకఁబడదనుట కిదియే నిదర్శనము.

---

# 5 వ అధ్యాయము

## పోరాటము యొక్క ప్రథమదశ

వెనుకటి యధ్యాయములో భారతీయులు తమ బాధల నివారణకై వీలున్నంతలో నెట్లు కృషిసల్పిరో తెలిసి కొంటిమి. కాని, యీ ధర్మయుద్ధమునకుఁ బూర్వము ప్రభుత్వమువారును, పత్రికలును తెచ్చిపెట్టిన యిబ్బందుల నెదుర్కొనుటలో వారికున్న లోపములఁగూర్చి విచారింతము. 1893 వ సంవత్సరమునాటికి గుమాస్తాలుగాఁ బనిచేయుటకు దగిన యక్షరాస్యతమాత్రముగల వర్గ మొకటియు, దక్షిణాఫ్రికా

లోనే జన్మించి విద్య నభ్యసించి న్యాయస్థానములలో చట్ట వ్యాఖ్యాతలుగనున్న వలసకూలీల బిడ్డలవర్గము మఱియొకటియు మాత్రమున్నవి. వీరు స్వతంత్రముగ సహాయము చేయఁ గలవారు కారు.

ఇట్టి ప్రభుత్వముయొక్క నిర్బంధములకు, యూరపియనుల యాందోళనమునకు గుఱియైన భారతీయులలోఁ గొలఁదిమంది పారసీకులు, సింధీయులు, మహమ్మదీయులు, గుజరాతీయులు మొదలైనవారు కలరు. వీరందఱు వ్యాపారస్థులు. ఆంగ్లవిద్య యెక్కువగ రానివారు. ప్రజోద్యమములలో ననుభవములేనివారు. అందుచే యూరపియనులలో నుదారులైన న్యాయవాదుల సహాయమున విన్నపపత్రములఁ బంపుకొనియు, రాయబారపక్షముల బంపించియు, నింతవరకును ప్రభుత్వముతోఁ బోరాడుచుండిరి. కాని, రాజకీయ చతురతలోఁ, దంత్రములలో, నెత్తునకుఁ బైయెత్తులు వేయుటలో నందెవేసిన చేతులైన యూరపియనులతోఁ బోరాడుటకు బాపము వీరి కెక్కడ సాధ్యమగును! చట్టవ్యాఖ్యానములు చేయుట యెంత యసాధ్యకార్యమో గుర్తించెదరుగాక! వీరికి వా రెక్కడ నందుదురు?

ఈ పరిస్థితులలో నేను నావృత్తిపనిమీఁద నీ క్రింది దాదా సందర్భములో 1893 వ సంవత్సరమున దక్షిణాఫ్రికాకు వచ్చితిని. వలస భారతీయులచరిత్ర నా కిప్పటికేమియుఁ దెలియదు. దాదా అబ్దుల్లా గుజరాతులోని పోర్బందరు వాస్తవ్యులు. సుప్రసిద్ధవర్తకులు. దక్షిణాఫ్రికాలో వీరి పేరఁ

పెద్దవ్యాపారము సాగుచుండెను. వీరికిని, ఆ దేశములోనే వ్యాపారము చేయుచున్న మఱియొక భారతదేశపు వర్తకునకును మధ్యనొక పెద్ద దావా జరుగుచుండెను. "దాదా అబ్దుల్లా కంపెనీ"వారు నన్ను వారి పక్షమున న్యాయవాదిగా బనిచేయుటకై యేర్పాటుచేసికొనిరి. యేర్పాటు ప్రకారము దావాలోఁ బనిచేయుటకై పయనమై యోడ నెక్కితిని. దక్షిణాఫ్రికా చేరితిని కాని, యీ దావా నొప్పుకొన్న సందర్భమున "దాదా అబ్దుల్లా కంపెనీ"ప్రతినిధి దక్షిణాఫ్రికాలోని పరిస్థితులను గూర్చి నాకుఁ జెప్పినదానికి, నిక్కడ గల్గిన యనుభవమునకును నేమియు సంబంధము లేదు. నా బారిష్టరు హోదాకును నా ప్రాముఖ్యమునకును దగినట్లుగానే నాకుఁ దెలిసినంతవఱకు జక్కగా ముస్తాబై యోడదిగి దర్బానులోఁ బ్రవేసించితిని. కాని త్వరలోనే నా హోదా, ప్రాముఖ్యములనుగూర్చిన భావములన్నియు స్వప్నములాయెను. భ్రమ వీడిపోయెను.

అచటి యూరపియనులు భారతీయులనందఱినికూలీలని పిలుచుట యాచారమయిపోయినది. వారిని జాల నమర్యాదగాను, నతి నీచముగానుగూడఁ జూచుచు నిత్యము పరిభవించుచుండిరని తొలినాఁడే గ్రహించితిని. మొదటి పక్షము రోజులలోనే న్యాయస్థానములలో నాకుఁ గల్గిన విషమానుభవములును, రైలుప్రయాణములో నాకు జరిగిన పరాభవములును, దారిలో నాకుఁ దగిలిన తన్నులును, హోటళ్ళలోఁ జూపఁబడిన నిరాదరణయును నన్ను మరింత విభ్రాంతుని జేసినవి.

నా వృత్తిని బాలించుచుఁ దాత్కాలికముగ నివసించుటకైన దేశము తగదని గ్రహించితిని. నిత్యము నన్నవమానపఱచు నిట్టి దేశమున నివసించుటయందుఁగాని, ధనమార్జించుట యందుఁగాని యభిలాష లేకపోవుటయేగాక యట్టి సంపాదన యెడల హేయభావముకూడఁ గల్గినది. అందుచే దిక్కు తోఁపక సంకటస్థితిలో నుంటిని.

దావా కుదుర్చుకొనవచ్చు డిక్కడి పరిస్థితులనుగూర్చి చెప్పినదానికి నాస్వానుభవము కేవలము విరుద్ధముగ నుండు టచే దావాలోఁ బనిచేయుట వదలుకొంటినని దాదా అబ్దుల్లా కంపెనీవారికిఁ జెప్పి స్వదేశమునకు దిరిగిపోవుటయో లేక యెన్ని కష్టములకైన నోర్చి నా కర్తవ్యమును నిర్వహించు టయో యీ రెండే మార్గములుకలవు. ఇట్టి యాలోచనలతో దర్బానునుండి ప్రిటోరియాకుఁ బ్రయాణము చేయుచున్న నన్నొక పోలీసుభటుడు 'మారిస్‌బర్గు' స్టేషనులో మొదటి తరగతి పెట్టెలోనుండి బయటికీడ్చివేసెను. రైలుబండి దాఁటిపోయెను. చలి విపరీతముగ నుండెను. విశ్రాంతి గదిలోఁగూర్చుండియుంటిని. నా సామానుగతి యేమాయెనో తెలియదాయె. ఎవరి నడిగిననింక మఱెన్ని తన్నులు, తిట్లు తినవలెనో, యవమానములకు గుఱి కావలెనో యని యడుగ సాహసింపనైతిని. తెల్లవారువరకు నట్లే జాగరణమొనర్చితిని. కర్తవ్యమూఢుడనై యుంటిని. తిరిగి స్వదేశమునకుఁ బాఱి పోవుట పిఱికిపంద లక్షణమని భావించి యొప్పుకొన్న దావాను గడువు పూర్తియగువఱకు సాగించి తీరవలెనని యర్ధరాత్రికి

నిర్ణయించుకొంటిని. దావా నడచుచున్న 'ప్రిటోరియా' కు నే నెన్ని పరాభవములు, దౌర్జన్యములు జరిగిన లక్ష్యపెట్టక చేరి తీరవలె ననుకొంటిని. నావృత్తి నిర్వహణతోఁబాటు స్థితిగతులఁగూర్చి కొంతచర్య తీసికొన నెంచితిని. ఈ నిశ్చయము తుదకు నా మనస్సునకు శాంతిని, బలమును నిచ్చెను. కాని, నిద్ర రాలేదు.

మఱునాఁ డుదయముననే దాదా అబ్దుల్లా గారికిని, రైల్వే యధికారులకును, దంతుల నిచ్చితిని. కంపెనీ పక్షపుఁ బెద్దలును నితరులునువచ్చి నన్ను బరామర్శించి మర్యాదచేసిరి. విచారమును వెలిబుచ్చిరి. నిత్యము వారిట్టి పరాభవములకు నలవాటుపడిపోయిరి. అంతగా లెక్క జేయకుండెడిరి. ప్రిటోరియాకుఁజేరులోపల దారిలో గుఱ్ఱపుబండ్లలో సహితము నేనింక నెన్నియో పరాభవములకు తన్నులకు గురియైతిని. కాని, వాని నన్నింటినిగూర్చి యిచ్చట వర్ణించుట నాభావము కాదు. అన్నింటిని సహించి దావాను పూర్తి చేసికొంటిని. ఆ వత్సరములో నచ్చటి నాయకులతో వారి కష్టసుఖములను గూర్చి యప్పుడప్పుడు ముచ్చటించుటయే తప్ప యేమియుఁ జేయలేక పోయితిని.

1894 వ సంవత్సరపు టారంభములో దర్బాన్‌కుఁ దిరిగివచ్చి స్వదేశమునకుఁ బ్రయాణ మగుచుంటిని. దాదా అబ్దుల్లా కంపెనీవారు నాకిచ్చిన వీడ్కోలు సందర్భమున నెవరోయొకరు "నేటాల్ మెర్క్యూరీ" యను పత్రిక నొక దానిని నాచేతి కిచ్చిరి. 'భారతీయుల ఓటుహక్కు' అను

శీర్షికతో యొక వ్యాసము దానిలోఁ గనిపించెను. దానిని జాగ్రత్తగ నర్థము జేసికొంటిని. స్థానిక ప్రభుత్వమువారు నేటాలు శాసనసభలో పై శీర్షికతో నొక బిల్లును బ్రవేశపెట్టబోవుచుండిరి. ఈ బిల్లు శాసనమైనచో భారతీయు లిదివఱకనుభవించుచున్న కొలఁది హక్కుల యంతమునకిది నాందియే యని గ్రహించితిని. ఈ బిల్లు సందర్భములో ప్రభుత్వమువారిచ్చిన యుపన్యాసములుకూడ నిస్సంశయముగ నా యభిప్రాయములనే ధృఢపఱచినవి. ప్రజలకు బిల్లు విషయమై బోధపఱచితిని. వారిహక్కులను హరించుటకై ప్రభుత్వము చేయఁబోవు నీ దండయాత్రను సర్వవిధములఁ బ్రతిఘటింపవలె నని హెచ్చరించితిని. వారందఱును నానందముతో నామోదించిరి. ఈ విషయములో నెట్లు ప్రభుత్వమును నెదుర్కొనవలెనో తమకుఁ దెలియదనియు, దీనివలనఁ గలుగఁబోవు చిక్కుల నన్నింటిని మీరే విస్పష్టముగ జెప్పితిరిగాన, మీ ప్రయాణమును మానుకొని మాకుఁ దోడ్పడ వలయుననియుఁ గోరిరి. అందుచే, సుమా రొక మాసములో బని పూర్తి కావచ్చునని ప్రయాణము నాపు చేసుకొంటిని. ఆ రాత్రియే యొకవిన్నపమును వ్రాసి తయారుచేసితిని. శాసనసభలో సమర్పించుటకు నిశ్చయించితిని. బిల్లునకు సంబంధించిన చర్యలన్నింటిని నొక రోజువఱకు నిలుపుచేయఁగోరుచు ప్రభుత్వమునకు తంతిని బంపితిని. ఈ పని నంతటిని నిర్వహించుట కొక సంఘము నేర్పాటు చేసితిని. 'సేట్ అజీ అదమ్' దాని కధ్యక్షులు. ఆయన పేరుతోనే యీ తంతి పంపబడెను. ప్రభుత్వము వెంటనే యీ బిల్లునకు సంబంధిం

చిన చర్యలన్నింటిని రెండురోజులవఱకు వాయిదా వేసెను. దక్షిణాఫ్రికా శాసనసభ కీ విధమగు విన్నపమంపుట కిదియే ప్రథమము. బిల్లు నాపలేక పోయినను నీ విన్నపము ప్రభుత్వ ములోను ప్రజలలోను ప్రభావముగఁ బనిచేసెను.

లోఁగడ నీ బిల్లు వివరములను గూర్చియు, దాని ఫలి తములను గూర్చియు దెలిసికొంటిమి. దానిరద్దుకై యాందోళన సాగించితిమి. ఇటువంటి ప్రజోద్యమములలో భారతీయుల కదివఱ కనుభవము లేకుండెను. అందుచే వారిలో నూతన చైతన్యము, నానందము వెల్లువయై ప్రవహింపసాగెను. నిత్య మును సభలు జరుపుచుండిరి. దినదిన మధికసంఖ్యాకులు సభ లకు వచ్చుచుండిరి. అవసరమైన దానికంటె నధికముగాఁ చందా మొత్తములు వసూలగుచుండెను. వందలాది వేలాది స్వచ్ఛందసేవకు లుత్సాహముతో నుద్యమమునకు సాయ పడిరి. విజ్ఞాపన పత్రిక నకళ్ళను వేలకొలఁదిగ దినమంతయుఁ గష్టించితయారుచేసిరి. రాత్రింబవళ్ళు కష్టించి సంతకములు సేకరించిరి. ఈపనిలోఁ గాలపరిమితిగతించిన వలస కూలీల బిడ్డలు, ఆంగ్లము బాగుగఁ దెలిసినవారు, చక్కగా వ్రాయ గలిగినవారు పెక్కుమంది పాల్గొనిరి. ఒకమాసములో పదివేల సంతకములతో 'రిప్పన్' ప్రభువునకొక విజ్ఞాపన యందఁజేయ బడెను. నేను సంకల్పించిన తక్షణచర్య పూర్తియైనది. ఇంక నింటికిఁబోవ సెలవు కోరితిని. 'మీరే మాకీ బిల్లులోని మర్మ ములను జెప్పి మమ్ము మేల్కొల్పి యింతవరకు కృషిచేసి మాచేఁ జేయించితిరి. వలసదేశముల కార్యదర్శిగారు విజ్ఞాపన

కిచ్చు సమాధానము ప్రతికూలముగ నుండునో, యనుకూల
ముగ నుండునో యెవరు చెప్పగలరు ? మా యుత్సాహ
మును మీరు చూచితిరి. పనిచేయుటకై మేము సిద్ధముగా
నున్నాము. చందా ధనమునకు కొదువలేదు. మీరు లేనిదే
మాగతి నావికుడులేని నావ చందముగ నుండును. చేసినపని
యంతయు వ్యర్థమగును. కాన, మీరు మా మధ్యనుండి
మమ్ము నడిపించుట ధర్మమని భావించుచుంటిమి, అని
గగ్గోలు పెట్టిరి.

వారి కోరికలలోని యౌచిత్యమును గ్రహించితిని.
ప్రయాణమును మఱల విరమించి యిచ్చటనే యుండుటకు
నిశ్చయించితిని. వారి కష్టములను దెలిసికొని పనిచేయుటకై
శాశ్వతసంస్థ నొకదానిని స్థాపించితిని. కాని, నే నెచ్చట
నివసింపవలెనో? ఎట్లు? ఒక దావా సందర్భంలో వచ్చితిని
గాని నివాసమునకై రాలేదాయె! నా బారిష్టరు హోదాకు
దగినట్లుగ, సంఘముయొక్క గౌరవప్రతిష్ఠలను పెంపొందించు
రీతిగ నివసింప వలసి యుండునుగదా! ఎట్లు? నాకు పెద్ద
మొత్తముగ జీతము నిచ్చెదమని వారు చెప్పిరి. నేను వెంటనే
స్పష్టముగా నిరాకరించితిని. 'ప్రజాసేవకుఁడు జీతము తీసికొన
గూడ'దని యంటిని. అదియునుగాక నేను మార్గదర్శకుఁడనుగా
బనిచేయవలసిన యువకుఁడను. విరాళమును వసూలుచేసి
యుద్యమమును నడుపవలసిన సంస్థమీద నా సొంత ఖర్చు
లకై యాధారపడుట భావ్యముకాదు. అని చెప్పి ప్రతిఫల
మును గట్టిగా నిరాకరించితిని. ప్రధాన వర్తకులు తమదావాల
నొక సంవత్సరంపాటు నా కిచ్చుటకు నిర్ణయము చేసి

కొన్నచో నా కభ్యంతరము లేదని సూచించితిని. సంవత్స రాంతమున నా పని తృప్తిగ నున్నఁ దదుపరివిషయము మాట్లాడుకొనవచ్చు నని చెప్పితిని. వర్తకులందరును నీ సూచన చాల బాగున్న దని యానందముతో నామోదించిరి. ఈ పద్ధతివలన నెవరిమీదను నాధారపడకుండ నా ఖర్చు లన్నియు మళ్ళునవియు నా వృత్తి, ప్రజోద్యమము బాగుగనే సాగుననియు నమ్మికతో 'సుప్రీముకోర్టు' న్యాయవాదిగాఁ బ్రవేశించుటకు దరఖాస్తును బంపితిని. నల్లవా రిచ్చట న్యాయవాదవృత్తి సాగించుటకు వీలులేదని యచట న్యాయ వాదసంఘపుఁ దెల్లసభ్యు లెన్నియభ్యంతరములు చెప్పినప్పటి కిని వానిని త్రోసివేసి న్యాయస్థానమువారు నన్ను న్యాయ వాదిగా నంగీకరించిరి. ఈ యూరపియను న్యాయవాదుల ప్రతిఘటన నాకు గొంతప్రాముఖ్యమును దెచ్చిపెట్టెను. పత్రిక లన్నియు వారినే పరిహాసపాత్రులుగ విమర్శించెను.

తాత్కాలికముగ [illegible]నాచే స్థాపింపఁబడిన సంఘమును శాశ్వత సంస్థగ సుసంఘటిత మొనర్చితిమి. "అఖిలభారత జాతీయ మహాసభ" యందు నాకు భక్తిశ్రద్ధలు మెండు. అందుచే నీ సంస్థకుకూడ 'నేటాల్ భారతీయ కాంగ్రెసు' అని పేరుపెట్టితిని. కాని, యీ రెంటికిని భేదముగలదు. అది సంవత్సరమున కొకసారి మాత్రమే సమావేశ మగుచుండును. కాని, యిది సంవత్సరమంతయు విధిగాఁ బనిచేయు సంస్థగ నిర్మింపబడినది. విరివిగా సభ్యులను జేర్పించితిమి. వారు వీరను భేదములేకుండ సకలభారతీయుల నిందు సభ్యులుగాఁ

జేర్చితిమి. సంవత్సరమునకు కనీసము నలుబదియైదు రూపా యల చందాను చెల్లించువారు సభ్యులుగాఁ జేర్చుకొనఁబడిరి. ఉదారముగ నెవరెంత భూరివిరాళము నిచ్చినను స్వీకరించు చుంటిమి. వందలకొలది విరాళములిచ్చువారు పెక్కుమంది కలరు. అనతికాలములోనే మూఁడువందలవఱకు సభ్యులను జేర్చితిమి. పెద్దవర్తకులుకూడ గ్రామగ్రామమునకుఁ బట్టణ ములకుఁబోయి బాగుగా ప్రచారముచేసి చందాలు వసూలు చేయుటచేఁ బ్రజలలో మంచి రాజకీయ జ్ఞానము కలిగెను. ఈ కాంగ్రెసున కనుబంధముగ సాంఘికసంస్థలను, విద్యా సంస్థలను నెలకొల్పి ప్రజలలో సంఘసంస్కారమును, విద్యను వ్యాపింపఁజేయ మొదలుపెట్టితిమి. అందు హిందువులు, మహమ్మదీయులు, పారశీకులు, మొదలగు నన్నిమతముల వారును గలరు. ధర్మయుద్ధమును దాని యుద్దేశములను బాగుగ గ్రహించుటకై యీ చరిత్ర యవసరమని విపుల ముగ వ్రాసితిని.

పై సంస్థలన్నియు నవి నెఱవేర్చిన కార్యక్రమ నివేదికల నతిశయోక్తులు లేకుండ నెప్పటికప్పుడు పత్రికాముఖమునను, గరపత్రముల ద్వారాను బ్రకటించుచుండెడివి. శత్రుపక్షము వారైనను జేసిన విమర్శనలు, చూపిన లోపములు సరియైన వైనచో వారెట్టి యుద్దేశముతో జేసినను సవరించుకొను టయే యుత్తమధర్మమని యట్లు చేయుచుండెడివారము ఆత్మగౌరవమునకు భంగములేని ప్రతిపక్షముతోడ రీతిని సహాకరించుచుండెడి వారము అట్టిచో నన్ని యవకాశముల

నుపయోగించు కొనుచుంటిమి. అన్ని పత్రికలకును నుద్యమ మునుగూర్చి వ్యాసములు పంపుచుంటిమి. భారతీయులను యక్రమముగ విమర్శించిన పత్రికలకు సమాధానములను వెంటనే పంపుచుంటిమి. ఇవ్విధముగ పనిచేయుచు నొకవత్సరము పూర్తిచేసితిమి. న్యాయవాదిగా నా పనికూడ నా కక్షిదారులకు తృప్తికరముగనే యుండెను. నేటాలులో నిట్లు చిరకాలము నే నాగిపోవలసివచ్చెను. సంఘముయొక్క యనుమతితో భారతదేశమునకు 1896 లో నారుమాసముల సెలవుమీద వెళ్ళితిని. ఆరుమాసములుకూడ పూర్తికాక ముందే వెంటనే రావలసినదని 'కేబులువార్త' వచ్చుటచేఁ దిరిగి దక్షిణాఫ్రికాకు వచ్చితిని.

ఇట్లిప్పటికే నేటాలులో నీ శాశ్వతసంస్థ ద్వారా రెండున్నర వత్సరములు ముఖ్యముగ రాజకీయముగ బని చేసితిని. ఇంక నుండవలసి వచ్చుటచే నాకుటుంబ మొకచోటను నే నొకచోటను నుండుట భావ్యముగాదని యీసారి కుటుంబ సహితముగఁ బ్రయాణమై రావెంచితిని.

మాతృదేశమునకున్న యారుమాసములలోఁ గూడ క్షణము వృథాపరచకుండ నన్నిరాష్ట్రములలోని పెద్దలను పత్రికలను చూచితిని. వారికి దక్షిణాఫ్రికాలోని పరిస్థితు లన్నింటిని వర్ణించి చెప్పితిని. లోకమాన్యతిలక్, గోపాల కృష్ణగోఖలే వంటి మహానాయకులకు, 'హిందూ' వంటి ప్రసిద్ధ పత్రికా సంపాదకులకు అక్కడి పరిస్థితులను సోదాహరణముగఁ జెప్పితిని. న్యా|వా.తలను యుపన్యాసములను

యాంగ్లపత్రికలుకూడ ప్రకటించినవి. విలేఖరులు ఐరోపా పత్రికలకుకూడ 'రూటర్' ద్వారా వార్తలు పంపుచుండెడి వారు. నేటాలులో నేను వ్రాయువ్రాఁతలను యూరపియనులు కొలఁదిమంది మాత్రమే చదువుచుండెడివారు. చాలగొలఁది మంది లక్ష్యము చేసెడివారు. కాని, భారతదేశములోని నా యుపన్యాససంగ్రహములను రూటరు పంపుచుండుటచే యతి ప్రాముఖ్యమునకు వచ్చి వారిదృష్టినెక్కువగ నాకర్షించెను. వానిని వారు బాగుగఁ జదువమొదలిడిరి. పత్రికావిలేఖ రులలోఁ గొంతమంది విచిత్రమైన ప్రవృత్తికలవా రుందురు. సత్యమునే లక్ష్యముగఁ బెట్టుకొనక, పూర్తిగా దెలిసికొనక సందర్భశుద్ధిలేని యపకతవక వార్తలనుగూడ పంపుట, యస త్యములను గూడ ప్రకటించుట జరుగుచుండెను.

నేటాలులోని నా విమర్శలకంటె నుపన్యాసములకంటె భారతదేశములోనివే సౌమ్యముగ నుండెడివి. ఇంతమాత్రము గూడ నేటాలు యూరపియనులు సహింపజాలరైరి. ఈ ప్రచారముచే భారతదేశమునుండి వలస కూలీలరాక నిలిచి పోయి వారి వాణిజ్య వ్యవసాయాదులు దెబ్బతినిపోవునని భయపడిరి. రూటరు ఏజన్సీవారుకూడ పత్రికలకుబంపఁదగి నంత విలువగలవిగ నెంచి పంపుటచేఁ బత్రికలలో వీని ప్రాము ఖ్యము హెచ్చెను. అందుచే వేలకొలఁదియూరపియనులుచదువ మొదలిడిరి. అట్లుడికినట్లుడికిపోవుచుండిరి. ఇట్టి సమయములో నేను కుటుంబ సహితముగ నాలుగు వందలమంది భారతీయ ప్రయాణికులను దక్షిణాఫ్రికాకుఁ దీసికొని పోవుచున్న

'కూర్లాండ్' అను స్టీమరులో పయనమైతిని. ఆదేసమయ ములో దాదాపు అంతమంది భారతీయ ప్రయాణీకులను దీసి కొని 'నాదేరి' యను మఱియొక నావగూడ బయలు దేఱెను. ఇంక చూడుడు! వారి ఆగ్రహావేశములు మిన్ను ముట్టెను. వారి భావపరంపరలగ్నిగోళములవలె బ్రద్దలై బయటి కుబికెను. నిత్యము సభలుచేయ మొదలిడిరి. నే నే భార తీయులను కావలెనని ఈ స్టీమరుమీఁద తీసికొని దండ యాత్రకు వచ్చుచున్నట్లు దురభిప్రాయపడిరి. భారతీయులతో నేటాలును నింపి వేయ నున్నానని యుపన్యాసములు చేయ మొదలిడిరి. వ్రాయుచుండిరి. దానితో వారి సంఘమంతయు రెచ్చిపోయెను. ఓడలనుండి ప్రయాణీకులను దిగనీయకుండ నాపుచేయించవలెనని యేకగ్రీవముగ తీర్మానించిరి. ప్రభుత్వము త్రిప్పివేయనిచో తామే యాపనిని స్వయముగ చేయుదు మని చెప్పుచుండిరి. అట్లు రెచ్చగొట్టు సమయమునకే ఓడలు రేవునకు జేరెను. అకారణముగ ప్రభుత్వమువారు అధికార దుర్వినియోగముచేసి ఓడలను సముద్రములోనే యొకటిగాదు రెండుగాదు "ఇరువదిమూఁడు" రోజులవఱకు నాపి వేసిరి. ప్రయాణీకులను ద్రిప్పి తీసికొని పొమ్మని యోడల యజమానులను నయమున, భయమున మందలించిరి. అదృష్ట వశాత్తు నీ ఓడల యజమానులు భారతీయులైరి. వీరును మహాధీరులు. సామాన్యులు గారు. దేశభక్తులు, ఆశలకు లోఁబడక, బెదరింపులకు భయపడక, తీరని నష్టములకుగురియై కూడ వారి కోర్కెలను దిరస్కరించిరి.

ఓడల నన్యాయముగ, చట్టవిరుద్ధముగ నేప్రభుత్వ మైన నెంతకాల మాపగలదు? ఎట్టకేలకు ఆంగ్ల ఉన్నతాధి కారుల సలహా వలనను నిరత మగు నొత్తిడి వలనను ప్రభుత్వ మసహాయతను ప్రకటించినది. ఓడలు రేవులోనికి రప్పింపఁ బడినవి. యూరపియనులు గత్యంతరము లేక దిగివచ్చువారిని సముద్రములోఁ ద్రోయుదుమనియు, పలువిధముల పరాభ వింతుమనియు బెదరించుచు ననేక ప్రకటనలు చేసిరి. ప్రయాణికులకు నేనును నావికులును ఈవిషయములను దాపరికము లేకుండఁ జెప్పితిమి. కాని, ప్రయాణీకులు నిర్భ యముగ నోడలుదిగి వెళ్ళుటకే నిశ్చయించుకొని బయలు దేరిరి. ఇఁక లాభము లేదనియుఁ, దాము ప్రభుత్వమును బరి హాసపాత్రుల మగుదుమనియు గ్రహించి యూరపియను నాయకులు ప్రజలను యప్పటికి శాంతిపఱచి పంపి వేసిరి. కాని 'ఎస్కాంబి' గారు నన్ను మాత్రము ప్రొద్దుగుంకువఱకు నోడ నుండి దిగనీయవద్దనియుఁ అట్లుచేయుట క్షేమకరమనియు నావికాధికారులకుఁ గబురుచేసిరి. నాకును యీావర్తమానము నందజేసిరి. ప్రయాణీకులతోఁబాటు నా కుటుంబమును గూడ పంపి వేసితిని. వారు సురక్షితముగ 'సేటురుస్తుంజీ' ఇంటికి జేరిరి. నన్ను వెంటనే రావద్దని కబురు చేసిన ఎస్కాంబిగారు ప్రభుత్వ న్యాయవాది. నాకు సుపరిచితులు. భయముచేగాక, వీరిమాట త్రోసివేయుట మర్యాదగ నుండునా యను సంశ యము నన్ను బాధించుచుండెను. పైగా నావికాధికారుల బాధ్యతకూడ నిందుకలదేమోయని సంశయించి యాగితిని. ఈస్థితిలో నాపూర్వమిత్రులును ,ప్రసిద్ధన్యాయవాదియు

నగు 'లాటన్' గారు నన్నాహ్వానించుటకై ఓడలోనికి వచ్చి ఎస్కాంబిగారితోట నమ్మట క్షేమకరముగాదనియు, దొంగవలె రాత్రిపూటపోవుట తమ కంత యిష్టముగ లేదనియు, భయములేనిచో యిప్పుడే తనవెంటవచ్చుట మంచిదనియుం జెప్పిరి. నా కేమియు భయములేదని చెప్పి కెప్టెన్ సెలవుతీసి కొని వారివెంట బయలుదేరితిని. నేను మామూలుగా ధరించు ప్రత్యేక నమూనా తలపాగాను ధరించితిని. మేము దర్బాన్ పట్టణ ప్రధానవీథిగుండ రుస్తుంజీయింటికి పోవలసియుండెను. సాయంకాలము సుమారు నాలుగుగంటలాయెను. ఆకాశము మేఘావృతమై చల్లగ నుండెను. రేవువద్ద సామాన్యముగ నుండు జనముకంటె ఎక్కువమంది లేరు. తలపాగాను ధరించు భారతీయుండ నే నొక్కడనే యగుటచేత కొంతమంది యూరపియను కుఱ్ఱవాండ్రు మమ్ములను చూచిరి. నన్ను వెంటనే గుర్తించిరి. 'అడుగో! గాంధి వానిని ముట్టడించండి. తన్నండి' అనుచు పెద్దకేకలు వేయుచు మీదకువచ్చిరి. కొంతమంది మా మీందకు రాళ్ళను విసర నారంభించిరి. యూరపియను పెద్దలు కూడ వీరితోఁగలిసిరి. క్రమక్రమముగ దౌర్జన్యపరులసంఖ్య పెరిగిపోయెను. నడచిపోవుట ప్రమాదకరమని 'లాటన్'గారు గ్రహించి వెంటనే ఒక రిక్షావానిని బిలిచెను. కాని, తోటి మానవునిచే లాగఁబడు రిక్షా నెక్కుట నాకుఁ గష్టముగ నుండెను. ఎప్పుడును యెక్కియుండలేదు. ఈ స్థితిలో విధిలేక యెక్క నెంచితిని. కాని, భగవంతుఁడు నన్నీ యవమానమునుండి రక్షింప నెంచెను గాబోలు! ఈ రిక్షావాడు యూరపియనుల బెదరింపులకు భయపడి పాఱ

పోయెను. నా పతనము తప్పిపోయెను. కాలినడకను గత్యం తరము లేక పోవుచుంటిమి. ఒక పెద్దగుంపు మమ్ము వెంటాడుచుండెను. మేము ఒకయడుగు వేసినకొలఁది గుంపులు పెరిగిపోవుచుండెను. 'వెస్టు'బజారుకు వచ్చుసరికి గుంపు విపరీతముగ పెరిగిపోయెను. ఏదిదొరికిన దానితో కొట్టుచుండిరి ఇంతలో నొక పెద్దదృఢకాయుఁడైన యూరోపీయుఁడు వచ్చి యమాంతముగ 'లాటన్' గారి నెత్తుకొని పోయెను. రాళ్ళవర్షము అధికమాయెను. నే నొక్కడనే మిగిలిపోయితిని. తలపాగాను కూడ లాగివేసిరి. ఇంతలో మరియొక స్థూలకాయుడు వచ్చి నా మీదఁబడి లాగి చెంపకాయ వేసెను. తన్నెను. స్పృహతప్పిపోవు సమయమునఁ బ్రక్కనున్న యింటిచూరును పట్టుకొని నిలబడితిని. నిట్టూర్పు విడిచితిని. అలసట తగ్గి యూపిరియాడగనే మరల బయలుదేరితిని. ఇంటికి సజీవుడనై వెళ్ళగలనను ఆశను వీడితిని. కాని, యిట్టిస్థితిలోఁ గూడ వెంటాడి కొట్టి హింసించుచున్న వారిని మనస్సులో నైన దూషించలేదని స్పష్టముగ జ్ఞప్తి గలదు. ఈ విధముగ ముట్టడిమూకలమధ్యగ దారిచేసుకొని పోవుచుండగా దర్బాన్ పట్టణపుఁ బోలీసు సూపరింటెండెంటుగారి భార్య యెదురుగ వచ్చుచుండెను. మాయిద్దరికి బాగుగ పరిచయము గలదు. చాల ధైర్యముగల స్త్రీ. నన్ను రక్షించుటకై సూర్యరశ్మి లేకున్నను వెంటనే గొడుగు తెరచి అడ్డుపెట్టెను. నా ప్రక్కనే నడచుచుఁ దీసికొనిపోవుచుండెను.

వృద్ధుడైన పోలీసధికారిగారి భార్యయగుటచేతను, స్త్రీ యగుటచేతను, యూరపియనులు స్త్రీలనెక్కువగ గౌరవించు

వారగుటచేతను, ఆమెకు హాని కలుగకుండ నన్ను కొట్టవలసి వచ్చుటచేతను దెబ్బలతీవ్రత తగ్గెను. ఇంతలో సూపరింటెం డెంటుగారికీ యుదంతమంతయుఁ దెలిసి నారక్షణకై పోలీసులను బంపెను. వారు నా చుట్టును పరివేష్టించిరి పోలీసు స్టేషను దారిలోఁ గలదు. అక్కడకు జేరితిని. నారాకకై నిరీక్షించుచున్న సూపరింటెండెంటుగారక్కడనే యొకగది యిచ్చెద ముండుమనిరి. కాని నేను వందనములతో వద్దని చెప్పి యింటికిఁ జేరవలె నంటిని. శ్రీమతి 'అలెగ్జాండరు' గారు నా ప్రాణరక్షణకు కారకురాలని ఆయనతో వందనపూర్వకముగ చెప్పితిని. ఏ విధమగు బాధలు లేక సేటుగారి భవనమునకుఁ జేరితిని. అప్పటికి దాదాపు ప్రొద్దుకుంకెను అక్కడ నున్న డాక్టరు 'దాదీబార్జొరు'గారు నా గాయము లన్నింటిని తనిఖిచేసిరి. పెద్దగాయము లంతగా లేవుగాని, యొకటిమాత్రము తీవ్రమైనదిగ నున్నదని చెప్పిరి. కాని, ఇంతటితో శాంతి దొరకు భాగ్యము నా కబ్బలేదు, వేలకొలఁది యూరపియనుమూకలు నన్ను వదలక సేటురుస్తుంజీ భవనముచుట్టు చేరిరి. రాత్రికాగానే పోకిరీమూకలుకూడ వీరితోఁ జేరెవి. నన్ను వారి స్వాధీనము చేయనిచో నింటిలోనివారందరితో బాటు యింటికే నిప్పుపెట్టి తగులపెట్టెదమని సేటుగారికి గబురు పంపిరి. రుస్తుంజీ చాలయోగ్యుడు; ధీరుడైన పెద్దమనుష్యుడు. ఇంతమాత్రముచే చలించువాడు గాడు.

అన్నింటికిని సిద్ధమాయెను. కాని యంతలో నీ యుదంతమంతయు సూపరింటెండెంటు అలెగ్జాండరుగారికిఁ దెలిసి

రహస్యపోలీసులతో వచ్చి, యీ గుంపులో చేరి పరిస్థితుల నతి జాగ్రత్తగాఁ గనిపెట్టుచు నతిచాకచక్యముతోను దెలివితోను ప్రవర్తించుచుండిరి. ఒక బల్లను దెప్పించి యింటి ద్వారమువద్ద నడ్డుగఁ బెట్టించి మీఁదనెక్కి యేదో మాట్లాడునట్లు నటించుచు ద్వారమును స్వాధీనము చేసుకొనిరి. తలుపులు వగులగొట్టి లోపలి కెవ్వరును బోకుండ భద్రము చేసిరి. రహస్య రక్షకభటులను జుట్టును గాపలాపెట్టిరి. తన క్రింద యుద్యోగస్థు నొకనిని హైందవ రక్షకుని వేషములో నా యొద్దకు దొడ్డిదారిని నొకచీటిని వ్రాసి పంపించిరి. చీటిని చూచితిని. అందిట్లు వ్రాసియుండెను. "మీరు మీ మిత్రుని, యాయన యతిథులను, ఆ స్త్రీని, మీస్వకుటుంబమును రక్షింప దలచినచో నీ చీటి తెచ్చిన మనుష్యునితో నిండియను పోలీసు వేషము ధరించి రుస్తుంజీ ధాన్యపుకొట్టులోనుండి యీ జనమునుండి తప్పించునొని మీకై ఎదురుచూచుచు నీ బజారు చివరనున్న బండినెక్కి పోలీసుస్టేషనుకు వెళ్ళుఁడు. మిమ్ములనుగాని, మీమిత్రులను మీకుటుంబమునుగాని రక్షించుట కింతకంటె వేఱుమార్గము నాకుఁ గన్పించుటలేదు. సముద్రమువలె ఘూర్ణిల్లుచున్న యీ మూక లాగ్రహావేశములతో రెచ్చిపోయియున్నవి. వారినదుపులోఁబెట్టుట నా వశముగా కున్నది. నా సలహాను వెంటనే యనుసరింపనిచో నీ మూకలు రుస్తుంజీ యింటికి నిప్పంటించి సమూలముగ నాశనము చేయుదురని నేను భయపడుచున్నాను. ఎన్ని ప్రాణములుం పోవలసివచ్చునో యెంతయాస్తినాశనమైపోవునో నే నూహింపఁ జాలకున్నాను." ఈ చీటిని చదువగనే పరిస్థితిని వెంటనే

గ్రహించితిని. వెంటనే పోలీసువేషధారియై వచ్చినవాని వెంట బడి యాయన చెప్పినమార్గముననే పోలీసుస్టేషనునకుఁ జేరితిని. మేము స్టేషనునకు సురక్షితముగాఁ జేరితిమనివార్త వచ్చువఱకు సూపరింటెండెంటుగారు మాకల యెదుటనే నిలువఁబడి వారితో హాస్యములాడుచు నేవో పాటలు పాడుచుఁ గాలయాపన జేసిరి. మేము చేరిన సంగతి తెలియఁగనే యాయన యిట్లు తీవ్రముగ ప్రశ్నింపసాగెను

ప్రశ్న:- మీ కేమి కావలెను?

సమాధానము:- మాకు 'గాంధి' కావలెను.

ప్రశ్న:- ఆయనను మీ రెందులకుఁ గోరుచున్నారు?

స:- తగులఁ బెట్టుటకు.

ప్ర:- ఆయన మీ కేమి హాని చేసెను?

స:- మమ్ములనాతఁడు భారతీయులయెదుట దూషించి, నిందార్హులుగాఁ జేసెను. నేటాలును భారతీయులచే నింపి వేయ గోరుచున్నాడు.

ప్ర:- ఆయన బయటికి రానిచో మీ రేమి చేసెదరు?

స:- ఈ యింటికే నిప్పంటించి తగులఁబెట్టి వేసెదము.

ప్ర:- ఈ యింటిలో నాయన పిల్లలు, భార్య, వేరు పెద్దలు, స్త్రీలు, ననేకులు కలరు. ఏపాపము నెఱుఁగని వీరినందఱను తగులబెట్టుట మీకు సిగ్గుచేటు కాదా!

స:- దానికి మీరే బాధ్యులు. మమ్ములను మీరు నిస్సహాయులుగాఁ జేయుచున్నపు డీ విషయములో మే మేమి చేయఁ గలము? ఎవరికి నెట్టిహాని చేయవలెనని మాకు

లేదు. మాకొక్క 'గాంధి' నిచ్చినఁ జాలును. వాఁడే దోషి. కాని, మీరు గాంధిని మా కీయని కారణముచే నాతనిని బట్టుకొనుటలో నితరులకు హాని కలిగిన మమ్మేమి చేయమందురు? మమ్ము నిందించుట పాడియా?

ఇఁక నిప్పుడు భయము లేదు. కాన సూపరింటెండెంటు గారు రహస్యమును బయటఁ బెట్టిరి. 'గాంధిగారు మీమధ్య నుండియే దప్పించుకొని పోయినారు. ఈ యింటిలో లే' రని చెప్పునరికి గుంపులు పకపక నవ్వి, 'యిదంతయు సర్వాబద్ధము సర్వాబద్ధ'మని కేకలు వేసిరి. మీ ముదుసలి సూపరింటెండెంటుగారి నే మీరు నమ్మనిచో దయచేసి మీ వారిని ముగ్గురినో, నలుగురినో యొకసంఘముగ నియమించి యిల్లంతయు వెదకించండి. ఈలోపుగ నితరు లెవ్వరును లోపలికి వెళ్ళమని ప్రమాణము చేయండి. ఆ పెద్దల సంఘమే యిల్లంతయు వెదకివచ్చి గాంధిగారు లేరని చెప్పినచో నల్లరి చేయక శాంతముగ వెడలి పోవుదమని బాసచేయుడని చెప్పెను. ఈరోజున మీరు రెచ్చిపోయితిరి. మీ పోలీసువారి మాటనే మీరు వినరైతిరి. ఇదిమీకును మాకును గళంకమే. అందుచే పోలీసు వారొకయెత్తు వేసినారు. ఆయెత్తులో మీరు పడి పోయినారు. మీకోపాగ్ని కెఱయగు గాంధిగారు తప్పించుకొని పాఱిపోయినారు. ఇందుకు మీ పోలీసులను మీరేమాత్రము నిందింపరాదు. మీచే ప్రజారక్షణకై నియమింపబడిన వారు తమ ధర్మమునే పాలించిరి. ఇందు వారి తప్పేమి యున్నది? 'ఈ వాక్యములను సూపరిండెంటుగారు ధీర

ముగను గంభీరముగను మాట్లాడుటచేఁ బ్రజలు బాసనిచ్చిరి. సంఘమును నియమించిరి. వారిల్లంతయుఁ గాలించి గాలించి వెదకివచ్చి గాంధిగా రెచ్చటికో తప్పించుకొనిపోయిరని ప్రకటించిరి. సూపరింటెండెంటుగారు నిజమే చెప్పిరనియు, నీ చదరంగపు టెత్తులో మనమే యోడిపోయితి మనియు గ్రహించి మూఁకలు హతాశులైరి. కాని, వారు మాట చెల్లించుకొని. ఏ కొంటెపనిచేయక యెక్కడివా రక్కడనే చెల్లాచెదరైపోయిరి. 1897 వ సంవత్సరము జనవరి 13 వ తేదీన యీ గాథ జరిగెను. ఈ గాథకుఁ బూర్వము నేనోడలో నుండఁగనే దర్బాన్ పత్రికావిలేఖరి నన్ను సందర్శించి భారత దేశమందలి నా ప్రచారమునుగూర్చి యనేక ప్రశ్నలను వేసెను. అన్నింటికిఁ దగు సమాధానము చెప్పితిని. అతిశయోక్తి లేకుండ సవినయముగ మానవజన్మ మెత్తినందులకు సోదరులకు నాచేతనైన సేవచేసితినని చెప్పితిని. మా సంభాషణా సంగ్రహమంతయు మఱునాఁడే పత్రికలలోఁ బ్రకటింపబడెను. జ్ఞానముగల పెక్కురు యూరపియనులు తమ తప్పొప్పుకొని జరిగిన భయంకర సంఘటనకు సంతాపము వెలిపుచ్చిరి. వారి పత్రికలుకూడ యూరపియనుల దృక్పథమును గొంతవఱకుసమర్థించినను, నేకకాలమందే మాయుద్యమమును గూడ సమర్థించెను. ఈ సంఘటనలు నాయొక్కయు, భారతీయుల యొక్కయు ప్రతిష్ఠను హెచ్చుచేసెను. భారతీయు లెంత బీదవారైనను బిఱికి పందలుగారనియు భారతీయ వర్తకులుకూడ నాత్మగౌరవమును గాపాడుకొనుటకై యొంటి కష్టనష్టములకును త్యాగములకును వెనుదీయక పోరాడఁ

గలరనియు ఋజువాయెను. నా కమూల్యమైన యనుభవము కల్గినది. ఆరోజునుగూర్చి తలంచుకొన్నప్పుడు దైవము నాకు ధర్మయుద్ధమునకై శిక్షణనిచ్చుచుండెనని భావించెదను.

ఈ భయంకరసంఘటనలసంగతి తెలియఁగనే ప్రభుత్వ కార్యదర్శియగు 'చేంబర్లేను' గారు నేటాల్ ప్రభుత్వమునకు కేబుల్‌ద్వారా న్యాయము కలుగఁజేయవలయు నని యాజ్ఞలను బంపిరి. అప్పుడు ప్రభుత్వ న్యాయవాది 'ఎస్కాంబి' గారు నాయొద్దకు వచ్చి ఛేంబర్లేనుగారి కేబులుం వార్తనుగూర్చి చెప్పిరి. నాకు జరిగినదానికి విచారమును దెలియఁజేసి యోదార్పు మాటలు చెప్పిరి. అంతకంటెఁ బ్రమాదము జరుగనందులకు సంతసమును వెలిపుచ్చిరి. నేటాలు ప్రభుత్వము దుండగీండ్ర మీఁద నభియోగము మోపి శిక్షించుటకై సిద్ధముగ నున్నదని తెలియజేసిరి. 'అభియోగము మోపవద్దని నిశ్చయము చేసికొంటి'నని చెప్పితిని. పాపము వారి దేమున్నది? వారు దోషులని నే నెంచ జాలను. నాయకులు రెచ్చగొట్టి యేమి చెప్పిన దానినే ప్రజలు నమ్ముదురు. నిజానిజములు తెలిసికొను నోర్పుగాని, యవకాశముగాని వారికుండవు. ఆవేశపరులైన ప్రజ లెవ్వ రైన నిట్లేచేయుదురు. అదియే న్యాయమని తలంతురు. దీని కంతటికి యూరపియను సంఘమువారును, నాయకులైన మీరును, ప్రభుత్వమువారును బాధ్యులు. 'రూటర్' ఏవో సందర్భశుద్ధిలేని వార్తలను బంపిన వంపవచ్చు. కాని, యేమి మునిగిపోయినది. నేను నేటాల్‌కు వచ్చుచున్న సంగతిమీరుకుఁ దెలిసియే యున్నది గదా! నన్ను స్వయముగ గలిసికొని

భారతదేశములో నా ప్రచారమునుఁ గూర్చి, మీ కున్న సందేహములను గూర్చి ప్రశ్నించి నా భావమును తెలిసికొనిన మీఁదట మీకు యుక్తమని తోఁచిన చర్య తీసికొనుట మీకు న్యాయము కాదా? అయినప్పటికి నిప్పుడు మిమ్ములనుగాని, మీ సంఘమువారిని గాని యీ దౌర్జన్యమునకు ప్రేరకులని బాధ్యులుగాఁ జేసి కేసు పెట్టజాలను. పెట్టగల్గినను మీ న్యాయస్థానముద్వారా పరిహారము పొందవలెనను కోరిక నాకు లేదు! నేటాల్ యూరపియను హక్కులను స్వార్థమును గాపాడుటకు మీరు యుక్తమనితోఁచిన చర్యను దీసికొంటిరి. కాని, భారతీయులు తమ హక్కులను నాత్మగౌరవమును రక్షించుకొనుటకై సత్యాగ్రహ ధర్మయుద్ధమును జరుపవలసియున్నట్లు తోఁచెడిని. ఇదంతయు వినిన ఎస్కాంబిగారు నన్నుఁ జాలయభినందించిరి. "నే నెవరిమీఁదను నేరము మోపదలచలేదని బుద్ధిపూర్వకముగా నే నిశ్చయించుకొంటి" నని వారడుగగా చీటినప్పుడే వ్రాసియిచ్చితిని. ఆయన మఱల ధన్యవాదములు చెప్పి వెడలిపోయెను.

## ఇంగ్లండులోని కార్యక్రమము

వెనుకటి యధ్యాయములో భారతీయు లెట్లు కష్టనివారణకై కృషిచేసి తమ పేరు ప్రతిష్ఠలను వృద్ధిచేసికొనిరో పాఠకులు తెలిసికొనిరి. స్వసంఘమును సంస్కరించుకొనుచు నుద్యమము నేక కాలమందే బలపఱచుకొనుచుఁ బరదేశములలోకూడఁ బ్రచారమును సాగించిన విధములం గూర్చి గమనించితిరి.

ఇవ్వి ఇాంగ్ల దేశమునుండి కూడ సహాయ సంపత్తులను బొంది మా యుద్యమమును బలపఱ్చుటకై చేసిన ప్రచారమును గూర్చి క్లుప్తముగా దెలుపుచున్నాను. పని సుకరముగ జరుగుట కిక్కడి నేటాల్ కాంగ్రెసుకును, ఇాంగ్ల దేశములోని ఇండియా కాంగ్రెసు కమిటీకిని సంబంధము గూర్చుకొంటిమి. ఆ కమిటీ ఛెయిర్మన్‌గారైన 'విలియం వెడ్డర్‌బరన్' గారికిని భారతవృద్ధపితామహుఁడైన 'దాదాభాయి నౌరోజి' గారికిని, నిక్కడివిషయముల నెప్పటికప్పు డుత్తర ప్రత్యుత్తరముల ద్వారా తెలియఁజేయుచుంటిని. అక్కడ పత్రికా ప్రకటనలకు నితరవ్యయములకు మేము పంపిన పైకమునుగూడ ద్రిప్పివేసి దాదాభాయి నౌరోజిగారే భరించుచుండిరి. కార్యక్రమము సాగించుటలో వయోవృద్ధులైనను నౌరోజీగారు యువకుల కంటెఁ జురుకుగను, క్రమముగను బనిచేసెడివారు.

---

# 6 వ అధ్యాయము

## బోయరు యుద్ధము

పాఠకులారా! మీరు వెనుకటి యధ్యాయములో దక్షిణాఫ్రికా భారతీయుల బాధలను గూర్చియు, దన్నివార ణార్థమై వారు తీసికొన్న చర్యలనుగూర్చియు, దెలిసికొంటిరి. ఈ పరిస్థితు లిట్లుండ కొంతమంది యాంగ్లేయుల కుట్ర ఫలిత ముగ నకస్మాత్తుగ బ్రిటిష్‌వారికిని, బోయరులకును మధ్య మహాయుద్ధము ప్రారంభమాయెను. ప్రచండముగ సాగుచుం డెను. మన ధర్మయుద్ధమునకును, దీనికిని ప్రత్యక్షముగ సంబంధము లేకపోయినను మనపోరాటము మధ్య వచ్చి యుండుటచేతను, నా సందర్భమున సత్యాగ్రహులమగు మన ధర్మ మేమి యను చర్చ వచ్చియుండుటచేతను, దీని ప్రశంస వచ్చినది.

మా నేటాలు కాంగ్రెసు సంఘమును సమావేశపరచి యిట్టి పరిస్థితులలో మనధర్మమేమియని చర్చించితిమి. శత్రువు నెదుర్కొనుట కిది మంచి తరుణమని కొంతమంది వాదించిరి. తటస్థముగ నుండుట మంచిదని మరికొంతమంది సలహా నిచ్చిరి. సత్యాగ్రహులమైన మనము వాస్తవ పరిస్థితులను గ్రహించి ప్రవర్తింపవలెను. మన మిప్పటికిని బ్రిటిష్ సామ్రాజ్య పౌరులము. దాని రక్షణక్రింద నుండి న్యాయ మును బడయగోరుచున్నాము. శత్రు వాపదలో నున్నపుడు

హింసించి ప్రక్కపోటు పొడుచుట సత్యాగ్రహ ధర్మమునకు విరుద్ధ మని మిత్రులనొప్పించి, 'మీ యీ సంకటస్థితిలో మిమ్ము హింసించుట మాయుద్దేశ్యము కాదు. మీ సామ్రాజ్య పౌరులమై యుండుటచే మీ కీ యాపదలో తోడ్పడుటయే మా ధర్మము కాన, మీ రీ యుద్ధమున మమ్ము మీ యిచ్ఛ వచ్చిన పనికై వినియోగించుకొనుడు. సంతోష పూర్వకముగ సాయ మొనర్చెదము' అని ప్రభుత్వమునకు తెలియజేసితిమి.

కొంతకాలము తర్వాత మాయందు విశ్వాసముకలిగి మమ్మొక 'అంబులెన్సు' దళముగ యుద్ధప్రాంతముల కంపిరి. భయంకరయుద్ధమధ్యమున ప్రాణములకు లెక్కజేయక క్షత గాత్రులకు సహస్రవిధముల సేవఁజేసితిమి. యుద్ధాంతము వఱకు నిష్కల్మషముగ మేము వినమ్రతతో చేసిన సేవకు మెచ్చి మాలో పెక్కుమందికి బిరుదములఁగూడ నిచ్చిరి.

# 7 వ అధ్యాయము

## బోయరు యుద్ధానంతరము

బోయరు యుద్ధముయొక్క ముఖ్యఘట్టము ముగిసినది. లోగడ బోయర్లు జయించి స్వాధీన పరచుకొనిన ప్రదేశము లనే గాక 'ట్రాన్సువాల్' 'ఆరంజి ఫ్రీ స్టేటు' లను గూడ జయించి బ్రిటిష్‌వారు స్వాధీనము చేసికొనిరి.

ఆరంభమున నసుకొనిన ట్లొకమాసముగాక నే నిప్ప టికి దక్షిణాఫ్రికాలో నాఱువత్సరము లుంటిని. ముందు జరగవలసిన కార్యక్రమ విధానముయొక్క సూత్రములు నిర్ణయింపబడియున్నవి. అనుభవమును గడించిన 'మన్‌సుఖ లాల్ ఖాన్'లవంటి పెద్దలు చాలమంది కలరు. ఇక్కడనే పుట్టి పెరిగి పెద్దలై బారిష్టరుపరీక్షలందుఁ గృతార్థులైనవారు కొంత మంది కలరు. వారు తమ సోదరభారతీయుల సేవచేయుటకై సిద్ధముగనున్నారు. ఉద్యమము చక్కగా సాగు నవకాశము గలదు. అయినను మిత్రులయనుమతితో మాతృదేశమునకు పోఁగోరి పైకారణములు చెప్పి నా కోరిక తెలియజేసితిని. కాని యిచ్చట నేవైన విషమపరిస్థితు లేర్పడి, నా రాక యవసరమని వారికిఁదోఁచి, నాకుఁ దెలియఁజేయఁగానే రావలె ననెడు నిబంధనపై మాతృదేశమునకుబోవుట కనుమతినిచ్చిరి. నేను సరేయని పయనమై మాతృదేశమునకుఁ జేరితిని.

నేను బొంబాయినగరమున నావృత్తిని సాగించుటకై వలయు నేర్పాట్లను చేసికొని భవనములను మాట్లాడుకొని న్యాయవాద వృత్తి ప్రారంభించితిని. దక్షిణాఫ్రికాలోని నా మిత్రులును, ఖాతాదారులును నిక్కడనుండుటచే నా వృత్తిబాగుగ సాగినది. నా రాబడి తృప్తిగనే యున్నది. గోపాలకృష్ణగోఖలేగారి సలహా ననుసరించి మాతృదేశము నకు నే జేయగల సేవా మార్గమును గూర్చికూడ యన్వేషించుచుంటిని. కాని భగవంతుడు నాజీవితమును శాంతిగ గడుపు నవకాశము లేకుండఁ జేసెను. నాల్గు మాసములైనను నావృత్తి పూర్తిగ సాగలేదు. మాతృదేశమునకు సేవచేయు భాగ్యము నా కబ్బలేదు. ఇంతలోనే ఛేంబర్లేనుగారు దక్షిణాఫ్రికాకు వచ్చుచున్నారనియు, నే నచట నుండవలసిన యవసరమెంతేనిగలదనియు, వెంటనే బయలుదేరి రావలయు ననియు కేబుల్‌వార్త వచ్చినది. వార్తఁజేరగానే నా ఆఫీసు నకు తాళము పెట్టితిని. ఆఱుమాసములలోనే మాతృదేశము నకుఁ దిరిగి రాగలనను నాశతో భారతదేశముననే కుటుంబ మును వీడి యొంటరిగా మొదటఁదొరికిన యోడలోనే బయలుదేరి డర్బాన్ చేరితిని. ట్రాన్సువాల్‌లో ప్రభుత్వ మేవో చిక్కులు తెచ్చిపెట్టియుండునని యూహించితిని. 'డర్బాన్' చేరఁగనే కథ యడ్డము తిరిగిన సంగతి తెలిసికొంటిని.

ఛేంబర్లేనుగారు మొదట డర్బానునకు వత్తురనియు, పరిస్థితులన్నియు వచ్చుటనే విన్నవించ వచ్చుననియుఁ దదుపరి యాయనవెంట ట్రాన్సువాలు వెళ్ళవచ్చుననియు మా

సంఘమువారు నిర్ణయించిరి. మా రాయబారవర్గమువారు ఛేంబర్లేనుగారిని దర్శించి నేటాలులోని పరిస్థితులన్నిటిని వివరించి చెప్పిరి. వారు చెప్పినదంతయు ఛేంబర్లేనుగారు సావధానముగ విని, విజ్ఞప్తిలోని విషయములనన్నిటిని నేటాల్ ప్రభుత్వముతోఁ జర్చించెదనని వాగ్దానము చేసిరి. ఇంక మా రాయబారవర్గము వారు నా యాధ్వర్యముక్రింద ఛేంబర్లేను గారిని ట్రాన్స్వాల్‌లో చూడ నిశ్చయించిరి.

యుద్ధమునకు, బూర్వము భారతీయు లెవ్వరైనను నెప్పుడైనను ట్రాన్స్వాలున యథేచ్ఛగఁ బ్రవేశించుటకు వీలుండెడిది. బోయర్ల రాజ్యాంగవిధానములోని సౌమ్యతయే దీనికిఁ గారణము. కాని, దురాశపరులైన, కొంతమంది యాంగ్లేయ కోటీశ్వరుల కిది గిట్టక భారతీయుల నాఫ్రికానుండి తఱిమివేయుటకును, వారి వ్యాపారములు సాగకుండ జేయుట కును ప్రభుత్వోద్యోగులతో కుట్రచేసి ప్రాంతచట్టముల ప్రయోగింపఁజేసి వేధింపసాగిరి.

ప్రభుత్వమువారు 'ఆసియా శాఖ'నొకదానిని సృష్టించిరి. దేశములో నొకప్రాంతమునుండి మఱియొక ప్రాంతమునకుఁ బోవలెనన్న, నీ శాఖ ప్రధానోద్యోగియొక్క యనుమతి లిఖితపూర్వకముగాఁ గావలెను. అట్టి యనుమతి పత్రము కొరకు దరఖాస్తు చేయవలెను. ఆయన దయగల్గినచో దరఖాస్తు మంజూరగును. మంజూరైన దరఖాస్తులను జూచి దిగువయుద్యోగు లనుమతి పత్రములిచ్చెదరు. ఈ తతంగమున కూడ చాల తిరుగుళ్ళు కలవు. ట్రాన్స్వాల్ పోవుటకు

నాకును అనుమతిపత్రములు కావలసియుండెను. పై కార్య క్రమమంతయుఁ బూర్తియై యనుమతి చేతికి వచ్చునాటికిఁ బుణ్యకాలము దాటిపోవచ్చును. ఛెంబర్లేను తిరిగి లండనుకుఁ గూడ పోవచ్చును. అందుచే నా మిత్రుడైన పోలీసు సూపరింటెండెంటుగారిని వెంట నిడుకొని యాశియా శాఖోద్యోగి దగ్గఱకు వెళ్ళి యవసరమైన ధృవపత్రముల నిచ్చి వెంటనే యనుమతి పత్రములు దెచ్చుకొనఁ గలిగితిని. మా రాయబారవర్గమును వెంటనిడుకొని ట్రాన్సువాల్ చేరితిని. చేంబర్లేను గారి దర్శనమునకై యాసియా శాఖద్వారా ప్రయత్నము చేయవలసియుండెను.

మా రాయబారవర్గములోనుండి నా పేరు తొలగించి నట్లు తెలిసినది. అందుచే రాయబారవర్గమువారు చేంబర్లేనుగారిని జూడఁగూడదని నిర్ణయించుకొనిరి. నే నట్టి యవమానమును లెక్కచేయుననియు, తక్కిన వారినిగూడ లెక్కచేయవద్దనియు, ప్రజాక్షేమము నే ముఖ్యముగా పాటించి చేంబర్లేనుగారిని దర్శించి, ట్రాన్సువాల్ పరిస్థితులను విన్నవించవలసినదనియు నచ్చఁజెప్పితిని. ఆ సమయమున నచ్చట నున్న భారతీయబారిష్టరు జార్జిగాడ్ఫ్రీగారి కీ పని నప్పగించి రాయబారవర్గమును బంపితిని. సందర్భానుసారముగా రాయబారవర్గమువారు నా పేరు ముచ్చటించుటచే చేంబర్లేనుగారిట్లు చెప్పిరి.

'గాంధిగారిని నేను దర్బానులో చూచితిని. అందుచే ఆయన నిచ్చట మఱలఁజూడ నిరాకరించితిని. ట్రాన్సువాల్

లోని పరిస్థితులను స్థానిక ప్రజలవల్లనే తెలిసికొనగోరి యిట్లు చేసితిని.

ఈ మాటలు యగ్నిలో నాజ్యము పోసినట్లాయెను. ప్రజలకు మిక్కిలి కోపకారణమాయెను. ఎంత పెద్ద హోదా గలవాఁడైనను ఛేంబర్లేనుగారు ఆసియాశాఖ వారెట్లాడించిన నట్లాడుదురని తెలిసికొంటిమి. నేను ట్రాన్సువాలు నివాసి ననిగూడ నాసియాశాఖవారికిఁ దెలియదు. దక్షిణాఫ్రికా భారతీయుల స్థితిగతులు నాకు బాగుగ తెలియు నను సంగతి యాశియాశాఖవారి కేమి దెలియును! నేను లేక పోయినను మా రాయబారవర్గము వారు నేను తయారుచేసిన విజ్ఞప్తిని దాఖలుచేసి యిక్కడ జరుగుచున్న ఘోరకృత్యములగూర్చి స్పష్టముగ విన్నవించిరి. ఛేంబర్లేనుగారు వెళ్ళిపోయినపిదప నిక్కడ యుద్యోగులతోను, నితరపెద్దలతోను సంప్రదించినమీఁదట మేము ను, ప్రభుత్వమును పెద్దమనుజుల తరహాగా నొకయొడంబడికకు వచ్చితిమి. దాని పర్యవసానముగ దేశమందున్న భారతీయులందరమును బారహుక్కులను స్థిరపఱచుకొనుటకు బుద్ధిపూర్వకముగ నొక్కమాట మీఁద శాసనరీత్యా చేయవలసిన నిర్బంధము లేకపోయినను నమోదుచేసి యనుమతి పత్రములను దీసికొంటిమి. దేశమంతటిని భారతీయులచేతనింపి, యూరపియనుల నిటనుండి తఱిమివేయు నుద్దేశము లేదుగాన నున్నవారిని గుర్తించుటకును వారి భయసందేహములు పోవుటకును నిట్లు చేసితిమి. కాని, కాలగర్భమున నేమి దాగియున్నదో యెవరి కెఱుక? ఆసియా

శాఖోద్యోగియగు 'లయొనల్ కర్టిస్' వల్ల రానున్న విపత్తు లను ముందు చదివి చూడఁగలరు. యూరపియనులకుసంబంధించిన యన్ని నిర్బంధశాసనములను రద్దుచేసి యాసియా వాసులకు సంబంధించిన చట్టముల నమలులోఁ బెట్టువని నాసియా శాఖవారిచేతిలోఁ బెట్టిరి.

1893 లో నే నెదుర్కొన్నదానికంటె యెక్కువ సంకటస్థితి నిప్పు డెదుర్కొనవలసివచ్చెను. ఒక విధముగఁ జూచిన ఛేంబర్లేనును జూచి చేయవలసిన పని యైనదిగాన నాయన వెళ్ళిపోయినవెంటనే నేనును స్వదేశమునకుఁ దిరిగి పోవచ్చును. కాని, విశాలమైన భారత దేశములో సేవచేయఁ గల నను మోహముతో నిక్కడిసోదరుల నెదుర్కొనుచున్న యపాయమును బాగుగా గుర్తించికూడఁ దిరిగి స్వదేశమునకు వెళ్ళినచో నా సేవాధర్మము వమ్మగును. అవకాశమును విడనాడిన బుద్ధిహీనుఁడ నగుదును. అందుచే భయంకరముగ గ్రమ్ముకొనివచ్చుచున్న దుష్టశాసన మేఘములు చెల్లాచెదరై పోవుటయో లేక మమ్ము ముంచి యెత్తిపార వేయుటయో తేలువరకును, నా జీవితమంతటి నిక్కడనే యవసరమైనఁ గడుపుటకు నిశ్చయించితి నని మిత్రులతోఁ జెప్పితిని. వారందరు ఆనందపరవశులై 1894 లో వలెనే నా వృత్తికి సహాయము జేయుట కంగీకరించిరి. అందుచే ట్రాన్సువాల్ కోర్టులో బనిచేయుటకై దరఖాస్తు చేసితిని. సుప్రీంకోర్టులో 'అటర్నీ'గా చేర్చుకొనఁబడితిని. జోహాన్సుబర్గ్ పట్టణములో నాఫీసుపెట్టి పని ప్రారంభించితిని. అన్ని ప్రాంతములలోకంటె

భారతీయులిక్కడ విశేషముగ నుండుటచే నావృత్తియు ప్రజోద్యమము బాగుగా సాగినవి. ప్రస్తుత మీదారుణమైన నూతన సమస్య వచ్చుటచే 3 పౌనుల పన్ను, ఓటు హక్కు హరించుట మొదలగు నితర సమస్యలను వెనుకకు నెట్టివైచి దీనిమీద నాందోళనను తీవ్రముగ సాగింప నెంచితిమి.

ఆశియాశాఖ యాట కట్టింపకున్న 'ట్రాన్స్వాల్' నందు భారతీయుల బ్రతుకే భారమైపోవు స్థితి యేర్పడినది. ఆసియాశాఖ కుతంత్రమువలన మేము బుద్ధిపూర్వకముగఁ జేసిన నమోదులు రద్దయిపోవుస్థితి యేర్పడినది.

బ్రిటిష్ రాజ్యాంగ విరుద్ధముగ పౌరసత్వములను హరించుటకై బోయర్లుచేసిన చట్టములన్నింటి నొక పట్టీగా తయారుచేయుటకు, ప్రభుత్వమొక కమిటీని వేసెను. ఇది భారతీయ పౌరులకు మేలుచేయు నుద్దేశముతోఁ దలపెట్టినది కాదనియు, బోయరుల కాలములో బ్రిటిష్‌వారికిఁ గల్గింప బడ్డ యిబ్బందులను రద్దుచేయుటకు భారతీయుల కంఠముల కుచ్చులను మఱింత బిగించుటకును నుద్దేశింపఁ బడినదనియు ననుభవము ఋజువుచేసినది.

---

# 8 వ అధ్యాయము

## సౌజన్యమునకు బహుమానము – నల్లచట్టము

లోగడ యధ్యాయములో జరిగిన యొడంబడిక ప్రకారము ప్రాత యనుమతిపత్రము (పర్మిట్లు) లకు బదులు క్రొత్త యనుమతిపత్రములను దీసికొన్నచో బాధ తప్పిపోవుననియు జీవితము సుకరమగుననియు భావించితిని. కాని. దీనికి భిన్న పరిస్థితి సంభవమగు సూచనలు కన్పించుచుండెను. ఆసియా శాఖలో నొక యుద్యోగియైన 'లయొనల్ కర్టిన్' చాల చిత్రమైనవ్యక్తి. న్యాయశాస్త్రకోవిదుడు. ప్రతివిషయమును చట్టశాస్త్రపద్ధతిని నడుపఁజూచెడివాఁడు. సంప్రదింపులమూలమున వ్యవహారము పరిష్కరించుకొనుట సరిపోదని తలఁచెను. వీని వెనుక శాసనబల మవసరమని యాతఁడు తలపోసెను. మఱియు యూరపియనులతో సరిసమానమైన హోదాతో సమస్య సంప్రదింపులమూలమునఁ బరిష్కారమగుటచే భారతీయుల గౌరవప్రతిష్ఠలు పెరుగునని యతఁడు భావించెను. భారతీయుల గౌరవప్రతిష్ఠలు పెరుగుట యతనికి గిట్టదు. అందుచేఁ చట్టబలము శాశ్వతముగ వెనుక నుండవలయుననియు ట్రాన్సువాల్‌నందే గాక యన్నివలసదేశములకు మార్గదర్శకముగ నుండవలయుననియు నొకబిల్లును తయారుచేసి శాసనసభలోఁ ప్రవేశపెట్టి యామోదింపఁజేయవలెనని సంకల్పించెను. ఈ శాసనము లేనిచో మాఱువేషములతో

దొంగతనముగ ట్రాన్సువాల్‌లోఁ బ్రవేశించువారి నరికట్టు టకుఁగాని, యున్నవారిని దరిమి వేయుటకుఁగాని సాధ్యము కాదని వాదించెను. యూరపియనులు వీరి వాదమును సమర్థించిరి. "ఆసియా చట్ట సవరణ యార్డినెన్సు" ను ప్రభుత్వము గజెట్‌లోఁ బ్రకటించెను.

## ఆర్డినెన్సు వివరములు

ట్రాన్సువాల్‌లో నివసించు హక్కుగల ప్రతిభారతీయుఁడును, స్త్రీ గాని, పురుషుఁడుగాని, యెనిమిది సంవత్సరముల వయస్సు దాటిన బాల బాలికలుగాని వారి వారి పేర్లు నాసియా శాఖోద్యోగియొద్దకుఁ బోయి వ్రాత యనుమతి పత్రములనిచ్చి నమోదు చేయించుకొని క్రొత్తగ సక్రమ ధృవపత్రములను బొంది తీరవలయును. దరఖాస్తులో పేరు నివాసము, కులము, వయస్సు మొదలగు వివరము లుండవలెను. మనిషిని గుర్తుపట్టుటకై వలయు పుట్టుమచ్చలు మొదలగువానిని రిజిస్ట్రారు వ్రాసికొనవలెనట! వారి వారి వ్రేలిముద్రలను గూడఁ దీసికొన వలెనట! నిర్ణయింపఁబడిన తేదీనాఁటి కన్నివివరములతో నమోదు చేయించుకొనని యెడల, క్రొత్త ధృవపత్రములు పొందనియెడల వారు ట్రాన్సువాలులోనుండ నర్హులుగారు. ధృవపత్రములకై దరఖాస్తులు చేయనివారిపై నేరారోపణచేసి, న్యాయస్థానమువారపరాధము, కారాగారము, ప్రవాసములలో దేనినైనవిధింపవచ్చును. మైనరు బిడ్డల పక్షమున దల్లి దండ్రులే దరఖాస్తులు చేసికొనవలెను. వారి వేలిముద్రలు వేయించుటకు రిజిస్ట్రారు నొద్దకు

దీసికొని పోవలెను. తల్లిదండ్రులిట్లు చేయనిచో దోషు లగుదురు. మైనారిటీ దాటినపిదప నాపిల్లలు తమంతటఁదామే యట్లు నమోదు చేయించుకొననిచో వారును తల్లిదండ్రుల వలెనే శిక్షార్హు లగుదురు.

నేరపు జాతులవలె నమోదైనవారు క్రొత్త ధృవపత్రములను యుద్యోగు లెవరైన నెప్పుడెక్కడడిగిన నక్కడనే సిద్ధముగఁ జూపవలెను. అట్లు చూపింపనిచో నేరము క్రింద వైశితులకు గురికావలసి వచ్చును. బాటసారులు కూడ నట్లె చూపించవలెను. పోలీసుద్యోగు లీ ధృవపత్రములను తనిఖీ చేయుటకై యిండ్లలోఁగూడ ప్రవేశింప వచ్చును ఇతర ప్రాంతములకు వెళ్ళి తిరిగి ట్రాన్సువాలు లోనికివచ్చు ప్రతివా రక్కడ తనిఖీచేయునుద్యోగి యడిగినంతనే ధృవపత్రములను జూపవలెను! న్యాయస్థానమునకుఁ బనిమీద వచ్చినవారును నడిగినంతనే యక్కడ ధృవపత్రములఁ జూపవలెను. సైకిలు లైసెన్సుగాని, వర్తకపు లైసెన్సుగాని యిచ్చు రివిన్యూ ఆఫీసులోఁగూడ వీనిని జూపించవలెను అనగా యే భారతీయుడైన నే యుద్యోగివలన నేపనికావలసివచ్చినను నాపని చేయుటకు మును దీధృవపత్రములనడుగబడవచ్చును. వీనినిజూపనిచోఁ బై శిక్షలకు - బాత్రులగుదురు. ప్రపంచములోనే దేశములోను నిట్టి యవమానకరమైనట్టియు దారుణమైనట్టియు శాసనములు స్వతంత్రపౌరులకు వర్తింపజేయుట నే నెరుగను.

'నేటాల్'లోని వలసకూలీలుకూడ గఠినమైన యనుమతిపత్రముల పద్ధతికి గురియై యున్నారు కాని, పాపము

వారు స్వతంత్ర భారతీయులు కారుగదా! అయినను నీ యవమానపు టార్డినెన్సులోని శిక్షలుగాని, నిబంధనలుగాని వానితోఁ బోల్చిచూచిన నవి చాల తేలిక యని చెప్ప వచ్చును. స్వతంత్రపౌరులచే వ్రేలిముద్రలు వేయించుపద్ధతి దక్షిణాఫ్రికాలోఁగూడ నూతనమే. నేను చట్టములన్నింటిని తిరుగవేసితిని. ఈ వ్రేలిముద్రలు వేయించుటయొక్క నేరపు జాతులకేగాని యితరులకే దేశములోను నున్నట్లు కన్పించ లేదు. అందుచే నా వివరముల నన్నింటిని దెలిసికొనినప్పుడు నేను నిర్ఘాంతపోయితిని. ఇది ట్రాన్సువాల్‌లోని భారతీయు లకును, నన్ని వలసదేశములలోని భారతీయులకును మాత్రమే గాక యసలు భారతజాతికే యవమానకరమైనట్టియుఁ గళంక దాయకమైనట్టియు చట్టమని గుర్తింపగలరు. దీని యుద్దేశ మేమి? ఇట్టి యవమానకరమగు నార్డినెన్సు లెవరిమీఁద? అభము శుభము తెలియని నిష్కళంక భారతీయ ప్రజానీక మందఱిపైని. అట్టివారిని బతితులజేయుటకా! భారతజాతికా యిట్టి క్రూరశాసనములు! ఇట్టి శాసనముల కర్త్వమగు జాతి యిదియని యెవరైన గుండెమీఁదఁ జేయివేసికొని చెప్పఁ గలరా? నిష్కళంకుడగు నొక్కపౌరునిమీఁద నిట్టి యవమాన కరమగు క్రూరచట్టము ప్రయోగింపఁబడినను నదిజాతియంతటి మీఁదను బ్రయోగింపబడినట్లు కాదా!

'అయిన నాగ్రహావేశపరులమై తొందరపడరాదు. సహనము గోల్పోవరాదు. ఆవేశము ఆగ్రహము యంత్ర మునుండి వెలుపలికి వదలివేయఁబడిన యావిరివలె వ్యర్థమై

గాలికిఁ బోవును. ఆ యావిరినే యంత్రమునందు బంధించి సక్రమముగా సకాలమున వినియోగించుచో బ్రహ్మాండమైన కార్యమును సాధించుట మనము గాంచుటలేదా! అట్లె మన యాగ్రహావేశములను నిగ్రహించి, సత్యాగ్రహ' మను నఖండ శక్తిగమార్చి సకాలమున సక్రమముగ వినియోగించుకొన్నచో నది కనివిని యెఱుగని మహత్తర పరిణామములను సృష్టించగలదు. ఈ యాగ్రహావేశములు మనలను రక్షింపజాలవు. కాని, నిష్కళంకమైన మనస్సుతో నిబ్బరముగ నాలోచించి తగిన నిరోధక ప్రణాళిక నేర్పరచుకొని యుద్యమమును క్రమముగ ధర్మసమ్మతముగ సాగించినచోఁ దప్పక దైవమే మనకు దోడ్పడఁగలదు. అకుంఠితమైన విశ్వాసముతో నెన్ని కష్టనష్టములు, నెన్ని యవమానములు భరింపవలసి వచ్చినను, సర్వస్వమును గోల్పోయి యురికంబముల నెక్కవలసివచ్చినను వెనుదీయక ధర్మయుద్ధమని చెప్పదగిన యీ సత్యవ్రతదీక్షను సాగించినచో జయము తప్పదు — ముమ్మాటికిఁ దప్పదు. అని ప్రజలను ప్రబోధించుచుంటిమి.

మఱునాఁడే ట్రాన్సువాల్‌లో నొక బ్రహ్మాండమైన సభను 'అబ్దుల్ గని' గారి యధ్యక్షతను జరిపి యందఱకు నీ యార్డినెన్సునుగూర్చి విపులముగా నుపన్యసించితిని. మహాజనులందఱును బహుశ్రద్ధగా వినిరి. ఏదో క్రొత్తవింత జరుగునని యందఱును నాతురతతోఁ జూచుచుండిరి. ప్రజయెంత వ్యతిరేకించినను లెక్కచేయక ప్రభుత్వము శాసనసభలో బిల్లు నామోదించినచో దానికి దాసోహ మనరాదనియు, మహా

విపత్తువచ్చినను వెనుదీయక నిలువఁబడి పోరాడవలయుననియు నేకగ్రీవముగాఁ దీర్మానించిరి. అందఱకు నర్థమగునట్లన్ని భాషలలోను విషయ విశదీకరణ జరిగిన మీఁదనే పైరీతిగ దీర్మానించిరి. 'సేట్ హాబీబ్' గారు వృద్ధులు. అనుభవ శాలురు. ఆ దేశపు పురాతన వాస్తవ్యులు. రానున్న విపత్తుల నన్నింటినిగూర్చి యాయనగూడ నొక్కి వక్కాణించిరి. ఇక్కడనేకాదు, ప్రపంచమందంతటను సాధారణముగ నాగ్రహావేశములతో నిట్టి తీర్మానములు చేయుచుందురు. తదువరి నాచరణలోఁ బెట్టుటయందు జాప్యము జరుగుచుండును.

కాని, ఈసారి యిట్టి సమావేశములలో మామూలుగ జరుగని బద్ధతిని దేవుని పేరిట ప్రమాణముచేసి. 'హాదీ అబిబ్' గారు తీర్మానమును జదువుచుండ మేమందఱము నిలిచి దాని ప్రాముఖ్యమును, పవిత్రతను మనస్సునందుఁ జింతించుచు బలపఱచితిమి. బాధ్యతను పూర్తిగా గ్రహించితిమి. అందఱము భగవంతుని సాక్షిగాఁ బ్రమాణముచేసి తప్పక సత్యాగ్రహమునఁ జాల్గొనగలమని నిశ్చయముగఁ బలికితిమి. ఈ సభా సమావేశము యూదుమతస్థుల నాటకశాలలో జరుపబడెను.

# 9 వ అధ్యాయము

## సత్యాగ్రహ సమారంభము

మహాసభయందుఁ బెద్దలందఱి ప్రసంగములు ముగియఁ గనే మహాజనులందఱు లేచి నిలువఁబడిరి. ప్రార్థనానంతరము లలో, దేవాలయములలో దైవభక్తులు చేతులు మోడ్చి భగవంతుని గంభీరముగ బ్రార్థించురీతిని దైవసాక్షిగ నొక్కుమ్మడిని ప్రమాణములు చేసికొంటిమి. పిమ్మట పట్టణములందును గ్రామములందును సభలు జరిపి ప్రచారముల నారంభించితిమి. ఐచ్ఛిక సేవకులు నిద్రాహారములు లేక పనిచేయు చుండిరి. ప్రమాణపత్రములను ప్రజలనుండి తీసికొనుచు నీ ధర్మయుద్ధమున రాగల విపత్తులనుగూర్చి ప్రజలకు నాఁపరికము లేకుండఁ దెలియఁ జెప్పుచుంటిమి. ఇట్లొకవైపున సంఘమును సుసంఘటిత మొనర్చుచు, ప్రజలను సమర సమాయత్తులనుగఁ జేయుచు, మఱియొకవంకఁ బ్రభుత్వమున కెప్పటి కప్పుడు మా కార్యక్రమమును బంపుచు రాయబారములను జరుపుచుంటిమి.

### తదుపరి కార్యక్రమము

హాదీహాబీబ్ గారి యాధ్వర్యమున నొక రాయబారవర్గమును 'డంకన్' మంత్రిగారియొద్దకు బంపితిమి. మేము చెప్పిన దంతయు డంకన్ మంత్రి శ్రద్ధగా నాలకించెను. "హాదీహాబీబ్" గారు తమయెదుట నీ ప్రమాణ వాక్యముల నుచ్చరించు

చున్న సమయమున నీయనముఖమువంక మంత్రి తేఱిపాఱఁ జూచుచుండెను. 'ఏ యుద్యోగియైన వచ్చి నా భార్యను నీ వ్రేలిముద్రలను వేయమని అడిగినచో నా యాగ్రహమును నిగ్రహించలేను. నేను వెంటనే యతని నక్కడక్కడనే చంపి వేసెదను. నేను చచ్చెదను. అని యిట్లు పల్కుచుండ నాయన నేత్రము లెఱ్ఱఁబడెను. ఆవేశము ముఖమున దాండవ మాడుచుండెను. మంత్రిగారు చూచిచూచి, మేమునుస్త్రీలకు సంబంధించిన నిబంధనల సవరణలనుగూర్చి ఆలోచించుచుం టిమి తప్పక సవరణ జరుగునని చెప్పెను. మఱునాఁడట్లే ఆర్డి నెన్సులో స్త్రీలకుసంబంధించిన నిబంధనలు మార్పుచేయబడెను. మీరు చెప్పుకొన్న సాధక బాధకములన్నింటిని మే మాలో చింతుముగాని, ముందు మీ రార్డినెన్సు నంగీకరించి తదుపరి కోరఁదిమార్పులకై ప్రయత్నించుట మంచిదని మంత్రిగారు సలహానిచ్చిరి. సుతరా మది సహింపరానిదని సవినయముగాఁ జెప్పితిమి. మీరుచేయఁబోవు శాసనమునకు దాసోహమనుట కల్లయని, విస్పష్టముగాఁ జెప్పివైచితిమి. మాయుద్యమఫలితము కానిండు, వారిబుద్ధిపూర్వకమే కానిండు ప్రభుత్వము వారార్డి నెన్సులో స్త్రీలకు సంబంధించినంతవఱకుఁ జేసిన సవరణ ప్రజలలో నూతనోత్సాహమును గల్గించెను.

# 10 వ అధ్యాయము

## వక్ర నీతి

పూర్వారంగము:– ఇంతవఱకును స్వసంఘమును బల పఱచి స్థానిక ప్రభుత్వమునకు మా యుద్దేశ్యములను విన్న వించుచుంటిమి. ఇంక నింగ్లండునకుఁ బోయి రాయబారములు సాగించుట మంచిదని యెంచితిమి. "ట్రాన్సువాల్ బ్రిటిష్ ఇండియన్ సంఘు" సభ్యులను సమావేశపఱచితిమి. అందు నన్నును, హెచ్. ఓ. హాలీగారిని రాయబారులుగ నెన్ను కొనిరి. మేమింగ్లండునకు వెళ్ళి ప్రముఖులందరి తోడను మా యుద్యమమునుగూర్చి విపులముగ జర్చించితిమి.

మా కృషి సర్వతోముఖముగ నుండుటచే నచ్చటి యధికారులలోను, ననధికారులలోను గూడ మా సమస్య చాలఁ బ్రాముఖ్యమునకు వచ్చెను. ఇంగ్లండునందలి భార తీయ విద్యార్థులును, బెద్దలును కష్టమనక నష్టమనక యన్ని స్వల్ప విషయములలోఁగూడ మాకు సాయపడుటచే మా యుద్యమ మచిరకాలములోనే ప్రాముఖ్యమునకు రాగల్గినది.

ఇంక మేము దక్షిణాఫ్రికాకుఁ బ్రయాణమై యోడ నెక్కితిమి. మార్గమధ్యమున 'మెడీరా' రేవు చేరగనే యొక కేబుల్ ఇంగ్లండులో మా సంఘ కార్యదర్శియగు 'ఎల్. డబ్ల్యు. రిచ్'గారి నుండి మాకు జేరినది – 'ఎల్గిన్' ప్రభువు

గాను ఆర్డినెన్సును శాసనముచేయుటకు నిరాకరించుచు ప్రక టించిరని యందుఁ గలదు. మా యానందమునకు మేఁ లేకుం డెను. కాని, దక్షిణాఫ్రికాకుఁ జేరఁగనే మా భ్రమ వీడెను. పాపము! మా సెక్రటరీ 'రిచ్' గారికిఁ దెరవెనుక జరిగిన భాగ వతమేమి తెలియగలదు? అప్పటికి ట్రాన్సువాల్ చక్రవర్తి వలస దేశము. ప్రభుత్వము వారిచేతులలోనే యున్నది. బ్రిటిష్ సామ్రాజ్య ప్రధాన సిద్ధాంతములకు యీ బిల్లు విరుద్ధమగుటచే ప్రత్యక్షముగ దీనినామోదింపజాలరు. అం దుచే వలస దేశముల ప్రభుత్వ కార్యదర్శియగు ఎల్గిన్ ప్రభువు భారతీయులకు మిత్రునివలె నటించి పై ప్రకటన చేసెను.

కాని 'మీకు' త్వరలోనే బాధ్యతాయుత ప్రభుత్వము సిద్ధింపనున్నది. అపుడు మీరీ బిల్లును మీ శాసన సభలోఁ బ్రవేశపెట్టి చట్టముచేయించి పంపినచో వెంటనే యంగీకార ముద్రవేయించి పంపెదను. కాన మీకు దిగులొందఁ బని లేదు' అని యప్పటి ప్రసిద్ధ ప్రభుత్వ న్యాయవాదియు, ప్రతినిధియు నగు 'రిచార్డ్' గారితోఁ జెప్పెను. అతఁడు వల్లె యని చంకలుకొట్టుకుని రహస్యమును బయట పెట్టెను.

# 11 వ అధ్యాయము

## పానకములో పుడక

1907 సంవత్సరము జులై వచ్చినది. ఆఫీసులను దెఱచి యుద్యోగు లనుమతిపత్రము లిచ్చుటకు సిద్ధముగా గూర్చుండిరి. కాని, వచ్చు వారేరి? మేము పువ్వుగుర్తుగల ఐచ్ఛిక సేవకులను ప్రతియాఫీసుదగ్గర రోడ్లమీద కావలా పెట్టితిమి. వారి కొసగిన యాజ్ఞ. పిరికితనముచేగాని, స్వార్థముచేగాని యనుమతి పత్రములకై నెవరైన పోవుచో వారి యెడల నిరసనగా ప్రవర్తింపరాదు సరిగదా, మరింత మర్యాదగా మాట్లాడవలెను. వారికీ యనుమతి పత్రముల యందున్న నీచతను, గష్ట సుఖములను జెప్పవలెను. చెప్పినను విననిచో వారి నెవ్వరు నభ్యంతర పెట్టగూడదు. ఆఫీసునకు వెళ్ళనీయవలెను. ఐచ్ఛిక సేవకులుగాక యితరులు కొలందిమంది యనుమతిపత్రములకై పోవువారిని బెదరించినట్లును, భయపెట్టినట్లును దెలియగనే యట్టివేమియు జరుగకుండ గట్టుదిట్టములు చేసితిమి. హెచ్చరికలు చేసితిమి. అంతటితో నాగిపోయినది. పెక్కువేలమందిలోనే కొలదిమందియో పోవుటకు లజ్జించిరి. అందుచే ప్రభుత్వమొక తంతు మొదలు బెట్టినది. అట్టి పిరికివారిని గనిపెట్టి రాత్రిపూట మీకై యాఫీసులు తీసి యుంచెదము రండి. అనుమతి పత్రములు తీసికొండని వారి తాబేదారులచే గబుర్లు చేసిరి. మానవ దౌర్బల్యము

నెంతకాలము కాపాడఁగలము ? తాము బయట పడకుండ కొంతవఱకు రహస్యముగ నిట్లు అనుమతి పత్రములు తెచ్చుకొనవచ్చునని కొంతమంది నాయకులే వెళ్ళిరి. కాని ఐచ్ఛిక సేవకులు మెలకువతోఁ గనిపెట్టి యట్టివారిని జూచుచుండిరి. అతి మధుర శ్రుతిరాగసహిత సత్యాగ్రహోద్యమములో పానకములో పుడకవలెఁ గొలదిపాటి యపశ్రుతులు తప్పలేదు. స్వార్థము సిగ్గును విడనాడఁజేసి తప్పుమార్గమును బట్టించునుగదా ! ఆఫీసులలోఁగాకుండ ప్రజల యిండ్లలో గూడ ననుమతి పత్రము లీయబడెను. కాలము గడచిన కొలఁది సిగ్గు విడనాడి బహిరంగముగఁ గూడ వెళ్ళుచుండెడివారు. కాని, ప్రభుత్వమిన్ని తంటాలు పడినను ఫలితము నామమాత్రముగనే యుండెను. అందుచే నాసియాశాఖోద్యోగులకడుపు మండెను. ఇంక తీవ్రదండనముల నవలంబించినచో ప్రజలు భయపడి లొంగిపోవుదురని యనుమతి పత్రములు లేనివారిని బాధింప దొరకొనిరి.

# 12వ అధ్యాయము

## మొదటి ఖైదీ

'జెర్మిష్టన్' వాసి, పండిట్ రామసుందరము మొదటి ఖైదీ. ఇతఁడు కొన్ని సంస్కృత శ్లోకములను వల్లించెను. ధైర్యముగఁ గన్పించుచుండెడివాడు. ఆ వేళపూరితో పన్యాసములను జేయుచుండెడివాడు. ప్రజలలోఁ గొంత పలుకుబడి సంపాదించినాడు. అందుచే నితనిని నిర్బంధించినచో చాల మంది భయపడి వచ్చి అనుమతి పత్రములను దీసికొందురని ప్రభుత్వవర్గమునకుఁ దిరిగిపోయిన కొంతమంది సలహా నిచ్చిరి. అతనిని జెయిలులో వేసిరి కాని, వారియూస లడియూసలాయెను. ప్రజలలో నుత్సాహము, పట్టుదల ద్విగిణీకృతములాయెను. అధికారులకుఁగూడ నిదియంతయుఁ గ్రొత్తయగుటచేతను, నుద్యమము ధర్మబద్ధమై శాంతముగ నడుపబడు చుండుటచేతను, ప్రజానాయకులను సగౌరవముగఁ జూచు చుండిరి. రామసుందరమునకు మొదటివాఁ డగుటచే మంచి మర్యాద నిచ్చిరి. ప్రజలలో నందుచే నుత్సాహము పెరిగి జైలన్న భయము లేకుండఁబోయెను. ఆసియాశాఖోద్యోగు లాసించినదానికి విరుద్ధఫలితములు కలిగెను. కాని, నిజము నిలకడమీఁదఁ దేలునన్నట్లు రామసుందరము వర్తనము మంచిది కాదనియు, దురభ్యాసములకు లోనైనవాఁడనియు దెలియవచ్చెను. కారాగారమునుండి వచ్చిన తదుపరి తన

బలహీనతను గుర్తించి లజ్జపడి పాఱిపోయెను. ఇది ముందు వచ్చెడి వ్యక్తుల విషయమై జాగ్రత్త తీసుకొనుటకై హెచ్చరికగ నుండెను. కాని అతఁడు పాఱిపోయినను దాత్కాలికముగ నుద్యమమునకుఁ గొంత ప్రోత్సాహమే కలిగెను.



# 13 వ అధ్యాయము

## నిర్బంధ పరంపరలు

ఉద్యమము యొక్క ప్రాబల్యము పెరిగిపోయినది. కొంతమంది పెద్దనాయకులను గూడ వరుసగా బంధించినఁ గాని దీని నరికట్ట లేమని వారికిఁ దోఁచెను. 1907 సంవత్సర ప్రాంతములో నాయకులకు మాజిస్ట్రేటు నోటీసులనుబంపెను. 'మీరు నమోదు చేసికొని ధృవపత్రములను తీసికొనని నేరమునకు మిమ్ములను నిర్ణీతకాలములో దేశమునుండి యెందులకు వెడలగొట్టకూడదు?' అని యందలి సారాంశము.

తంబినాయుడుగారి కిట్టి నోటీసు వచ్చినది. ఈయన చాల గట్టివాఁడు. చివరివఱకు నిలిచిన ధీరుడు. అరవదేశస్థుడు. ఈయన తండ్రి మద్రాసునుండి "మారిటియస్"నకు బోయిరి. ఈయన జన్మస్థానముకూడ నదియే. తంబినాయుఁడు మొదట చిన్ని వర్తకుడు. పెద్ద విద్యావంతుడు కాకపోయినను నను

భవమువలన కాలక్రమమునఁ జాలభాషలలో మంచి ప్రావీణ్యత సంపాదించెను. చక్కని యాంగ్లభాషను వ్రాయను, చదువను నేర్చెను. వ్యవహారదక్షుడు. దృఢకాయుడుకూడ, పనిచేయుటలో నిట్టివా రరుదు. రాత్రింబవళ్ళరుఁగడు. నామోషి యని యేచిన్నపనిని విడువఁడు అవసరమైనపుడు రోడ్లమీద మూటలనుగూడ మోసికొని పోవుచుండెడివాడు! ఈయనకుఁ గోపమనెడి శత్రువులేకున్న నేనాడో ముఖ్యనాయకులలో నొకఁడయ్యెడివాఁడు. కాని యింత మాత్రముచే నిగ్రములేని పొగరుబోతు కాదు. ఉద్యమమున కెట్టి భంగమును, నవకీర్తిని దనకోపమువలన రానీయలేదు. ఏది యెట్లున్నను మొదటి శ్రేణికిఁ జెందినవారిలో నీయన పేరుండగలదు. నాకును నోటీసు వచ్చినది.

న్యాయస్థానములో మేమెవ్వరమును బ్రతివాదమును బెట్టుకొని నిర్దోషులమని వాదింప దలచుకొనలేదు. మీచట్టరీత్యా మేము దోషులమే కాని, ఆత్మగౌరవమును గాపాడుకొనుటకై శాసనధిక్కారము చేయుట మాపవిత్రపౌరధర్మము. అందుచే నీశాసనమును ధిక్కరించితి మని చెప్పితిమి. నేను మాత్ర మొకవాఙ్మూలము నిచ్చుటకై యవకాశమిమ్మని కోరితిని. న్యాయస్థానము వా రంగీకరించిరి. ప్రిటోరియాలో నాతోడి ఖైదీలు మూఁడుమాసములశిక్షను బొందియున్నారని వింటిని. అస లీ యుద్యమమున కంతటికిని నేనే ప్రేరకుడను. వా రనుచరులు. అందుచే నే నధిక దోషినికాన నాకధికతమముగుశిక్ష విధింపవలెనని కోరుచున్నాను.” అని చెప్పితిని. కాని న్యాయ

స్థానము వారంగీకరింపక నాకు రెండు మాసములు విడికైదును మాత్రము వేసిరి నే నేకోర్టులో న్యాయవాదిగ నుండి న్యాయమునకై పోరాడుచుంటినో యా న్యాయస్థానములోనే దోషిస్థానములో నిలువఁబడుట మొదట నాకుఁ గొంచెము హేయముగఁ దోచినట్లు జ్ఞప్తి. కాని, వెంటనే నిజస్థితిని గ్రహించి న్యాయవాదికంటె యీ నేరస్థుని స్థితియే మంచిదని తలంచితిని. ఇంతలోఁ బోలీసుజవాను వచ్చి నన్ను బంది ఖానాలోనికి దీసికొనిపోయి బల్లపైఁ గూర్చుండుఁడని చెప్పి తలుపువేసి వెళ్ళిపోయెను.

ఒక్క క్షణములో మెఱపు మెఱసినచందమున నా మనోఫలకమున నిల్లు, న్యాయస్థానము, సభాసమావేశములు దృశ్యము లయ్యెను. స్వప్నమువలె నట్లే పోయెను. నే నిప్పు డొక ఖైదిగనుంటిని.—మరొక్కక్షణములో నీ భావపరంపరలు వచ్చివడెను ఈ రెండుమాసములలో నేమి జరుగునో? జైలునందు రెండుమాసములు పూర్తిగా గడపవలసిన దేనా? ప్రమాణము చేసినప్రకార మందరు నుద్యమములోనికి దుమికి జైలునకువచ్చిన రెండుమాసములవఱకుఁ గూడ నుండవలసి యుండదుగదా! కాని, యందరు నుద్యమములోనికి రాకున్న, జైళ్ళు నింపకున్న రెండుమాసము లుండవలసివచ్చును. విసుగుగ నుండును. నే చెప్పినంతసేపు పట్టలేదు. ఇంతలోనే యిట్టి భావపరంపరలమధ్య మఱి యీ క్రింది భావతరంగములు వచ్చెను. ప్రజలకు నేను చేసిన యుపన్యాసము లేమి? ప్రబోధము లేమి? జైళ్ళు చక్రవర్తి యతిథిగృహము లని

చెప్పినది నేనేగదా! ధన మాన ప్రాణములకు లెక్కచేయక ఆనందముతో ఖైదుకవాటములను దెఱచుకొని లోనికిఁ బొమ్మంటిని. ఉరికంబము నెక్కుటకుఁగూడ సిద్ధము గండని చెప్పితిని. ఏమి? ఈ జ్ఞానమంతయు నెటు మాయమై పోయినది? ఈ భావపరంపరలు మంచి బలవర్ధకౌషధమువలెఁ బని చేసినవి. అట్టిభావములు గల్గినవుడు నాలో నాకే సిగ్గుగల్గినది. ఇతరుల కెట్టి శిక్షలువేసిరో, యింక నెవ రెక్కడికి వత్తురో యని ఆలోచనలో నుండగ నింతలోనే ఖైదుకవాటములు తెఱువఁబడెను. సేవకుడు వచ్చెను. 'సంసిద్ధమై నావెంటరం'డని చెప్పెను. నేను సిద్ధమై వెంటనే వెళ్ళితిని. పోలీసువానులోనికి అతఁడే నన్నెక్కించెను. 'జోహాన్సుబర్గ్'పట్టణమునకుఁ గొంపో బడితిని. ఇచట నా దుస్తులను దీసివేయించి ఖైదీల కిచ్చు ముతకి దుస్తుల నిచ్చిరి. మొదట సంకోచముగనుండెను. కాని, ఖైదునకు వచ్చినపిదప కొంతముతకిని గూడ సహించవలెనని యిచ్చినవానిని ధరించితిని. నన్నొక గుహావంటి పెద్దగది లోనికి, దీసికొనిపోయిరి. అక్కడి కితరమిత్రులు శిక్షితులై వచ్చుచుండిరి. నా నిర్బంధానంతరము జరిగిన యూరేగింపులను గూర్చియు, జనసమూహములను ప్రభుత్వము వారెల్లుకొరడాలతో గొట్టి చెల్లాచెదరు చేయఁబూనిరో మొదలుగాఁగల సంగతులనుగూర్చియు వినుచుండెడివాఁడను. గుహావలెనున్న యొకేగదిలో నందఱమును గలిసియుండుట మా కానందదాయక మాయెను. ఇనుపపెట్టెలో నున్నట్లుండెడిది. నిర్బంధము లెక్కవైనకొలఁది ఆదరణలు మర్యాదలు తగ్గిపోయినవి. ప్రభుత్వమువారు బహుళక సలహాలు పంపియుందురు.

దక్షిణాఫ్రికాలో రెండే రకముల ఖైదీ లుండెడివారు. ఒక రకము తెల్లవారు, రెండవరకము నల్లవారు. రెండవరకము వారు నీగ్రోలు. ఈ నీగ్రోల ఖైదులలోనే మమ్ముల నుంచెడి వారు. విడిఖైదీలకు సొంతదుస్తులను ధరించుహక్కును, భోజనాది సౌకర్యములును గలవు. కాని, మే మన్నిటిని నిరాకరించి మామూలు ఖైదీలతో నుండెడివారము.

సత్యాగ్రహోద్యమమును దీవ్రముచేయుటకై లైసెన్సులులేకుండ వ్యాపారముసాగించిరి. అందుచే వారిని బంధించి ఖైదులో వేయుచుండెడివారు. ఖైదులు నిండిపోవు చుండెడివి.

'జోహాన్సుబర్గు' ఖైదులో నుదయము విడిఖైదీలకుప్పులేని గంజి యిచ్చెడివారు. మధ్యాహ్నము నాల్గు ఔన్సుల అన్నము, నాలుగౌన్సుల రొట్టె ఒకఔన్సు నేయి, కొంచెముప్పు, సాయంకాలము మఱికొంచెము గంజి, నొకటిగాని రెండుగాని బంగళాదుంపలో లేక యితర శాకములో యిచ్చెడివారు. అన్నము శుద్ధపాకము. ఈ ఆహార మెవ్వరికిని తృప్తికరముగ నుండెడిది కాదు. మేమచట వైద్యుని కొంచెము తాలింపుద్రవ్యముల నిప్పింపుమని కోరెడివారము. ఇది ఇండియాకాదని ఒకటేమాట! ఏది అడిగినను ఖైదీలు వాదప్రతివాదములు చేయరాదని సమాధానములు చెప్పుచుండెడివారు.

నూవరింటుండెంటును వేరె వండుకొనుటకు మా కనుమతి నిమ్మని కోరితిమి. ఆయన యిచ్చెను. మా వర్గమునకుం

పెద్దగా తంబినాయుడిగారి నెన్నుకొంటిమి. రేషనులు తక్కువ యిచ్చినపుడెల్ల, యధికారులతో ఆయన పోరాడి తగిన రేషనులను తెచ్చుచుండెడివాడు. రోజునకు రెండుసార్లు వంట చేసికొనుచుండెడివారము. మా స్వయంపాక మారంభమైన పిదప మాస్థితి కొంచెము బాగుపడినది. ఏ సౌకర్యముల నిచ్చినను, నియ్యకున్నను ప్రతియొక్కరు తమ తమ శిక్షాకాలమును బూర్తిగ సంతోషముతోఁ బట్టుదలతో గడుప నిశ్చయించుకొంటిమి. విడిఖైదీలుగాక నితరులసంఖ్య యారువందల యాభై యుండెడిది.

పనిలేకపోవుటచే జైలుప్రధానాధికారి యనుమతిపొంది మాగదులచుట్టువైపుల శ్రమపడి శుభ్రపరచెడివారము. స్థలము తక్కువగుటచే గానుగెద్దులవలె నచటనే కైవారములు చేయుచు డ్రిల్లు చేయుచుండెడివారము. 'వార్డరు'నకు తీరిక లేనప్పుడు "పఠాన్ నవాబ్ ఖాన్" అను నాతడు డ్రిల్లు చేయించుచుండెడివాడు. ఈయనకే భాషయు సరిగరాదు. చిత్రముగ శబ్దోచ్ఛారణ చేయుచుండువాడు. మేము పగులబడి నవ్వుచుండెడివారము. ఉదాహరణ "శాన్డలీజ్. శాన్డలీజ్" అనుచుండెడివాడు. ఇదేమి హిందూస్థానీశబ్దమో యని తలచుచుండెడివారము. కాని, చివరకు ఆలోచింపగా "Stand at ease" అనగా 'సరిగా నిలువుఁడు' అను ఇంగ్లీషునకు ఈ శాన్డలీజ్ అనునది నవాబ్ ఖాన్ ఇంగ్లీషని తేలినది. ఈ విధముగ జైలుజీవితము కష్టసుఖములతో గడచిపోవుచుండెను.

# 14 వ అధ్యాయము

## మొదటి రాజీ

గత అధ్యాయములో ఖైదుజీవిత మెట్లు గడచుచుండె డిదో పాఠకులు చవిచూచిరి ఒక పదును రోజులు గడచినవి. ఇంకను క్రొత్తఖైదీలు వచ్చుచుండిరి. ప్రభుత్వమువారితో నేవో రాజీప్రయత్నములు జరుగుచున్నవని వార్తలు తెచ్చిరి. 'జోహాన్సుబర్గ్' లోని అన్ని దినపత్రికలు బంగారుగనుల యజమానులచేతనే స్వాయముగ నడుపఁబడుచుండెడివి. ఈ ఘనులు వారి వారి స్వార్థముల కడ్డువచ్చు విషయములలోఁ దప్ప తక్కిన యన్ని విషయములలోను పత్రికాధిపతులకు స్వేచ్ఛ యిచ్చెడివారు. అందుచే సంపాదకులు రాజకీయములను గూర్చి వారి సొంత యభిప్రాయములను నిర్భయముగ వ్రాయుచుండెడివారు. 'ట్రాన్సువాల్ లీడరు' అను పత్రికాధిపతి "కార్టురైటు" చాల విశాలహృదయుఁడు. బహుసమర్థుఁడు. ఆయన యెప్పుడును తనపత్రికలో మా యుద్యమమును బలపరచుచు వ్రాయుచుండెడివాఁడు. నాకు మంచి మిత్రుడు. నన్ను ఖైదుకు గొంపోవగనే ఆయన "జనరల్ స్మట్సు" ను కలిసి మాట్లాడెను. ఆయన మధ్యవర్తిత్వమును స్మట్సు సేనాని అంగీకరించెను. కార్టురైటుగారు అందుచే భారతీయనాయకులను జూచెను. "మాకు చట్టసంబంధమైన రహస్యములు చిక్కులు తెలియవు. గాంధిగారు ఖైదులోనుండగా రాజీనిగూర్చి మాట్లా

డుట మాకు సాధ్యము గాదు. రాజీ మాకును సమ్మతమే. కాని, మా నాయకులు ఖయిదులో నుండగ ప్రభుత్వము వారు రాజీని కోరునెడల మీరు గాంధిగారిని దర్శింపవలెను" అని చెప్పిరి.

జనరల్ స్మట్స్‌గారి యొద్దనుండి రాజీ ముసాయిదా నొకదానిని తీసుకోని కార్ట్రైటుగారు నన్ను జైలులో జూచిరి. ముసాయిదాలోని అస్పష్టభాష నాకు రుచింపలేదు. అయిన ప్పటికిని నేజేయు సవరణ కంగీకరించుచో నా సంతకము జేయుట కంగీకరించితిని. కాని ఖయిదులోని మిత్రులతో సంప్ర దించకుండ యేమియు చేయఁజాలనని చెప్పితిని. నా సవరణ షరతులివి:-'ఒక చట్టమునకు లోఁబడిగాక బుద్ధిపూర్వకముగా పేర్లను నమోదుచేయించుకొనవలెను. నూతనముగ నమోదు జేసి యిచ్చు ధృవపత్రములలో మా సంఘమువా రామో దించు వివరములను మాత్రమే చేర్చవలెను. భారతీయు లీ విధముగ నధికసంఖ్యాకు లిచ్ఛాపూర్వకముగా రిజిష్టరులు పూర్తిచేసినపిదప నాసియాచట్టమును ప్రభుత్వము రద్దుచేయ వలెను. బుద్ధిపూర్వకముగాఁ జేసికొన్న యీరిజిష్ట్రరు శాసన ప్రకారము సరియైనవేనని నిర్ణయించవలెను.' అని వ్రాసి కార్ట్రైటుగారి కిచ్చితిని. వారు దీని కంగీకరించ లేదు. "స్మట్సుసేనాని నా చేతికిచ్చిన ముసాయిదాయె తుదిపరిష్కార మని చెప్పెను. నేనుకూడ నంగీకరించితిని, సందియము లేక మీరందరు బుద్ధిపూర్వకముగా రిజిష్ట్రరు చేయించుకొనుఁడు. ఆసియాచట్టము విధిగా రద్దుపఱచబడగలదు." అని ఆయన

నమ్మఁ బలికెను. అప్పుడు నే నిట్లంటిని:- "రాజీకుదురుగాక" కుదరకపోవుగాక ! మీ సహాయసానుభూతులకు మే మెప్పుడును కృతజ్ఞులమే. ప్రభుత్వము గౌరవప్రతిష్ఠలు కాపాడుకొనుటకై వాదుభావ కూడదని నాయుద్దేశము కాదు. నాకు గల శాస్త్రసమ్మతమైన సందేహ నివృత్తికై ద్వంద్వార్థము నిచ్చు పదజాలమును సవరించుట నా ధర్మము. సవరణ జేయకుండజాలను. ఏదైన రాజీ జరుగవలెనన్నచో నుభయపక్షములకు ముసాయిదాను సవరించు హక్కుండవలెగదా ! జనరలు స్మట్సు యిదివరకే బ్లాకు యాక్టు (Black Act) రూపమున నొక పిస్తోలును మామీద గురిపెట్టినాఁడు. ఇప్పుడంత్య సందేశ మను పేరిట మఱియొక పిస్తోలును గురిపెట్టి యేమిలాభమును పొందఁగలడని చెప్పితిని. కార్టురైటుగారు నా యీ హేతువాదమునకు వ్యతిరేకముగా నేమియుఁ జెప్పలేదు. కాని, నా సవరణను స్మట్సుసేనానిగారికి నివేదించెద నని చెప్పిరి.

తదుపరి నేను జైలులోని మిత్రులతో దీనిని గూర్చి సంప్రదించితిని. సవరణ నంగీకరించిన పక్షమున రాజీ నంగీకరింపవచ్చునని చెప్పిరి. బయటనున్న నాయకులుగూడ తమ సమ్మతికై వేచియుండక మీకు నుత్తమమని తోచిన విధముగ రాజీని జేయుఁడని, జైలుకువచ్చిన క్రొత్తఖైదీలతోఁ గబురు చేసిరి. తదుపరి నేనును 'లూయిూక్వీన్' తంబినాయుఁడు గార్లును ముసాయిదామీఁద సంతకములుచేసి కార్టురైట్ గారి కిచ్చితిమి. 1908 వ సంవత్సరము జనవరి 30 వ తేదీని

జోహాన్సుబర్గు జైలు సూపరింటెండెంటుగారు నన్ను 'ప్రిటో
రియా' లోనున్న జనరల్ స్మట్సుగారియొద్దకుఁ దీసికొని వెళ్ళిరి.
ఆయనతోఁ జాల సంభాషణ జరిగినది. కార్ట్రైటుగారికిని తన
కును మధ్య జరిగిన చర్చనంతను నాకుఁ జెప్పెను. నాజైలు
ప్రవేశము తరువాతగూడ సంఘమంతయు నొకకట్టుమీఁద
నొకమాటమీఁద దృఢవ్రతులై నిలువబడినందుకు వంద
నము లర్పించెను. నేను మీప్రజలయెడ నెప్పుడును ద్వేషము
కలిగియుండఁజాలను. నేనును బారిష్టరునే. నా కాలములో
భారతీయవిద్యార్థులు కొంతమంది నాయొద్ద నుండెడివారు.
మీ సంఘముతో నాకు బరిచయము గలదు. కాని నావిధిని
నేను చేయవలెనుగదా! యూరపియను లీ చట్టమును గావలె
నని కోరుచున్నారు. వీరందరిలో నెక్కువమంది ఇంగ్లీషు
వారే. బోయరులు కారు. ఈసంగతి మీకుఁ దెలిసియే
యున్నది. ముసాయిదాలోఁ జేయవలసియున్న దని చెప్పిన
మీసవరణను నే నంగీకరించుచున్నాను. నేను 'బోథా' సేనాని
గారితోఁగూడ సంప్రదించితిని. వారును సుముఖులే. మీరం
దరు బుద్ధిపూర్వకముగ నమోదు చేయించుకొని క్రొత్త
ధృవపత్రములను దీసికొనగనే నేను 'ఆసియా చట్టమును' రద్దు
చేసెదను. ఇది మీకు నా హామీ అని చెప్పెను. దానిని
రద్దుచేయుచు నమోదును సక్రమమొనర్చుచు మేము చేయు
శాసనముయొక్క ముసాయిదానుగూడ మీకు పంపెదను.
మీ సవరణను మీరు పంపవచ్చునని చెప్పెను. మఱల నిట్టి
బాధలు రాగూడదనియే నాకోరిక. మీ ప్రజలభావమును
నేను గౌరవింపఁగోరుచున్నాను.' అని చెప్పి స్మట్సుసేనాని

లేచెను. అప్పుడు నే నెక్కడికి పోవలయును? 'తక్కిన తోడి ఖైదీల సంగతి యేమి?' యని ప్రశ్నించితిని. ఆయన నవ్వి 'మీ రిప్పుడీక్షణమునుండియే స్వతంత్రులు. రేపుదయమున తక్కిన ఖైదీలనందఱను విడుదలచేయుమని యిప్పుడే యధికారులకు టెలిఫోనులోఁ జెప్పుచున్నాను. కాని, మీరు అనగా మీ ప్రజలు పెద్దయార్భాటములతో నుత్సవముల నూరేగింపులను సభలను జేయవద్దని నా సలహా! అట్లు చేసినచో ప్రభుత్వమువారిస్థితి చాలనవహాస్యముగ నుండు'నని చెప్పెను.

.'నేను మీ భావములనుగ్రహించితిని. పెద్దవటాటోపము నకై యెట్టిసభనుగూడఁ జేయుమని నమ్ముఁడు కాని, ప్రజలకీ రాజీ యెట్లు జరిగినదో తెలియజేయుటకై యవసరమైనసభలను మాత్రమే చేసెదము. కాని, ప్రజలు తమ విధులను, బాధ్యతలను నెఱవేర్చుటకై ననివార్యములు' నవసరము నైన వాని నేర్పాటుచేయగల'నని చెప్పితిని. 'అట్టివాని కభ్యంతరము లేదు' అని వారు వెడలిపోయిరి. అప్పటికి రాత్రి ఏడుగంటలైనది. జేబులో నొక దమ్మిడీకూడ లేదు. స్మట్స్ సేనాని కార్యదర్శి నాకు జోహాన్స్‌బర్గ్ టిక్కెట్టునకు డబ్బు నిచ్చెను. ప్రిటోరియాలో రాజీనిగూర్చి చెప్పవలసినది లేదు. నాయకులందఱు నిచ్చటనేకలరు. నా ప్రధానకార్యాలయము కూడ యిచ్చటనే కలదు. అందుచే నిచ్చట నుండవలసినపని లేదు. "జోహాన్స్‌బర్గ్"నకు ఒక రైలు మాత్రమే గలదు. దానిని నే నందుకొనగల్గితిని.

---

# 15 వ అధ్యాయము

## వ్యతిరేకత - పైబడి కొట్టుట

వెనుకటి యధ్యాయములో పాఠకులు రాజీవృత్తాంత మంతటిని దెలిసికొనియున్నారు. నేను 'జోహాన్సుబర్గు' పట్టణమునకు రాత్రి 9 గంటలకుఁ జేరితిని. సరాసరి మా కమిటీ ఛైర్మన్ 'సేట్ ఇసాఫ్‌మియా' గారింటికి వెళ్ళితిని. జరిగినకథ యంతయు వారికిని దెలిసినది. నా రాకకై నిరీక్షించుచుండిరి. నాకోరికననుసరించి నిరాడంబరముగా వెంటనే యొక సభ నేర్పాటుచేసిరి. ప్రొద్దుపోయినను వ్యవధిలేకున్నను మన వారు దగ్గరలోనే యుండుటచే చాలమంది సభకు హాజరైరి. సభకుముందే నాయకులకు రాజీసమాచారమంతయు పూస గ్రుచ్చినట్లు చెప్పితిని. నాకు గల్గిన సంశయములే వారికిని గల్గినవి. కొంతమంది ప్రాతికూల్యము కనపఱచిరి. నేను చెప్పిన దంతయు విన్నమీఁదటఁ బరిస్థితు లర్థము చేసికొనిరి. కాని, ప్రతివారికిని సందేహము బాధించుచుండెను. జనరల్‌స్మట్స్ మహాచతురుఁడు. అతఁడు ద్రోహముచేసిన నేమి కావలెను. వల్లచట్ట మమలు జరపకపోవచ్చును కాని, దాని నుపసంహరింపక యట్లేయున్న నేమికావలెను? ఈలోఁగా మన రిజిష్టర్లు పూర్తిచేసినచో శత్రువుచేతులలో మనము చిక్కుటలేదా? సత్యాగ్రహ మొనర్చుటకై యెక్కుపెట్టిన యాయుధము వారిజేతులలో జిక్కుటలేదా? వారు ముందు చట్టము రద్దు

చేయుట, తదుపరి మనము రిజిష్టరు ధృవపత్రమును దీసికొనుట క్రమపద్ధతికాదా? యని సంశయములు వచ్చిపడినవి.

వారికి నా జవాబిది; "మీ వాదము బహు ప్రశస్తమైనది. బాగుగా విచారింపదగినది. ఆ చట్టము రద్దయిన వెనుకనే మనము నమోదు చేయుట సర్వోత్తమము. కాని, యిది రాజీ రాజీ యనిన ప్రధాన సిద్ధాంతములకు భంగము లేనంతవఱ కుభయపక్షములు కొంతపట్టుదలను దగ్గించుకొన వలెనుగదా! దారుణశాసనములకు లొంగకుండుట, రద్దు చేయించుట, మన ప్రధానసిద్ధాంతము. నమోదులు పూర్తి చేయించుకొనుట, వారి భయసందేహములు తీర్చుకొనుట వారి ప్రధానసిద్ధాంతము. శాసనమునకు లొంగక ధిక్కరించితిమి. ఖైదునకు వెళ్ళితిమి. రద్దుచేయుట. కిప్పుడు వా రంగీకరించిరి. బుద్ధిపూర్వకముగా నమోదు చేయుటకు మన మంగీకరించితిమి. ఈ రాజీ సరిగా నమలు జరిగినచో నుభయ పక్షముల ప్రధాన సిద్ధాంతములు నెఱవేరునుగదా! కనుక మన కర్తవ్యమును మనము నిర్వర్తింతము. శాసనమునకు లొంగి చేయుట యాక్షేపనీయము. బుద్ధిపూర్వకముగా చేయుట నిరాక్షేపణీయము. లొంగిచేయుటకును, రాజీమీద బుద్ధి పూర్వకముగ చేయుటకును హస్తిమశకాంతరము గలదు. మన కర్తవ్యమును బూర్తిచేసిన పిమ్మట ప్రభుత్వమువారు ద్రోహముచేసిన నేమిచేయవలయు ననుదానికి సమాధాన మిదిః- నోట్లువ్రాసి సంతకములుచేసి తదుపరి యెగవేయుటకై ప్రయత్నము చేయుట లోకమున మన మెన్ని చూడ

చున్నాము? ముందు చట్టమును రద్దుజేసి మనచే నమోదులు [రిజిష్ట్రర్లు] పూర్తిచేయించి తదుపరి మఱల నట్టి చట్టమునే మఱియొకదానిని జేసిన మన మాపగలమా? ఇంతకును గొంత వరకు నమ్మకములేని దే వ్యవహారమును సాగదు. వచ్చినవారు పెద్దమనుష్యులు. జరిగినది రాజీ. రాజీచే మనప్రతిష్ఠ హెచ్చినదిగాని తగ్గలేదు. అయినను భయమేల? ఆయుధప్రయోగోపసంహారములు మనచేతనున్నవి. అది తెలియకున్న సమరమెట్లు సాగింపగలము? మనది ధర్మయుద్ధము. ధర్మయుద్ధమున దైవమే మనకు సమయానుకూలముగ చక్కని సాధనవిధానములను జూపుచుండును. చింతయేల!

కాని, ప్రతికూల పక్షముగఁ బనిచేసినవా రన్యాయగ్రస్తులై రాజీ కపార్థములు గల్పించి యపవాదముల నంటగట్టి యమాయకులకు విషముపోసిరి. రెచ్చఁగొట్టిరి. అట్లు రెచ్చగొట్టఁబడిగాని, దురభిప్రాయ మందిగాని యొక పఠానుసోదరుఁడు నా యుపన్యాసము ముగియఁగానే లేచి ప్రశ్నవరంపరలతో నన్నెదుర్కొనెను. ఏ పుట్టలో నే పామున్నదో నెవరికెరుక? సభానంతర మర్ధరాత్రివేళ నిట్లుజరుగుట రాబోవు తుపానుసూచనలే కాబోలు! ఎవరూహింపగలరు!

ప్రశ్న :- రాజీప్రకారము పది వ్రేళ్ళముద్రలను వేయవలసినదేనా?

స:- అవును - కాదు. నాయుద్దేశముప్రకారము నిస్సందేహముగా వేయవలసినదే, కాని యాత్మసాక్షిగ నభ్యంతరము గలవారును, నాత్మగౌరవభంగమని తలఁచువారును

నన్ని వ్రేళ్ళముద్రలను వేయవలసిన విధిలేకుండ సహాయము చేయించుకొను నవకాశమున్నది.

ప్ర :- మీ రేమిచేయుదురు?

స :- నేను పది వ్రేళ్ళముద్రలను వేయుటకు నిశ్చయించుకొంటిని. దేనినైన ముందు నేనుచేసి యితరులకుఁ జెప్పుట నా స్వభావము. అందఱికిని జెప్పి నేను చేయకుండ మిన్నకుండు టెట్లు?

ప్ర :- ఈ వ్రేలిముద్రలనుగూర్చి చాల పట్టుదలతోఁ దీవ్రముగ నిరసించుచు మాకునువలదని చెప్పినది మీరేగదా! ఉద్యమనాయకు కేంద్రవిషయము నిదేగదా! ఇప్పు డిట్[illegible] చెప్పుచుంటిరేల?

స :- "ఇప్పుడును నా విషయమున నా యభిప్రాయ[illegible]లు మారలేదు. అప్పటి పరిస్థితులలో నది [illegible] నైట స్థితులు మారినవి ఇప్పుడది యొప్ప[illegible]డు. (Client) నికి నచ్చుటకై లోగడ యీ సం[illegible]లవాఁ తీసుకొను లతో చర్చ జరిగినప్పుడు చేసిన వాగ్[illegible]గుల [illegible] యెత్తు మంతటిని మఱియొకసారి చెప్పితిని. [illegible] మ యత్నాలుగ దురభిప్రాయమును మార్చుకొన[illegible] ఆనా[illegible] కట

"మీ రెన్ని చెప్పినను మాకున్న [illegible] కున్నది. మీరు రెండు లక్షల యిరువదినై[illegible]వేల రూప్యములను లంచముగఁ బుచ్చుకొని 'సంఘగౌరవ ప్రతిష్ఠలను స్మట్సు సేనాని కమ్మివేసితిరట' మేము వ్రేలిముద్రలు వేయము;

ఇతరులను వేయనీయను. ఎవరు ముందు నాయకత్వము వహించి వ్రేలిముద్రలు వేయించుటకుఁ బూనుకొందురో, వేయుదురో యట్టివారి నల్లాసాహెబ్‌గఁ జంపి వేయుదు" ననెను. పఠానుసోదరుల స్వభావము నాకుఁ దెలియును. అంత తార్కికశక్తి కలవారు కారు. తేలికగ నమ్మువారు. అందుచే నిట్లు నమ్మిరి కాని, సంఘమును, సంఘగౌరవము నమ్ముస్వభావముకలవాఁడ నని యింక నితరులెవ్వరును నమ్మ రని నాకు రూఢిగఁ దెలియును. నేను పైన చెప్పిన వాద ములను, నే నిచ్చిన హామీలను గూడ విన్నపిదప నిట్లు దైవ సాక్షిగ హత్యచేయుదునని ప్రతిజ్ఞ చేయుట తాత్కాలి కావేశము చేతనే యనుకొంటిని. కాని. చంపుట, చంపబడుట ప్రస్థానులకు నిత్యకృత్యము వారి కపుడు స్వపరభేదములు యుమా నుండవు. అన్నదమ్ములుకూడ నొకరి నొకరు చంపు కొట్టఁబడిగాని,

రుఁడు నా యువనా సంతటికి నే నే నాయకత్వము వహించి వరలతో నన్నెదుర్కొజీకిఁగూడ నే నే బాధ్యుఁడ నగుటచే నెవరికెరుక్క? స[illegible]చేయుటకుఁ బోయి ముందు నేనే వేలిముద్రతో తుపా న[illegible]చన[illegible]సి యితరులచేత చేయింప నుద్దేశించితిని. అందుచే నా[illegible]వకా[illegible]ముువహించు నేనే యా పఠానుసోదరుని ప్రతిజ్ఞకు బలి[illegible]ను. అయినను చింతలేదు. నా ధర్మ మును నెఱవేర్చు[illegible] దైవము నాకుఁ దోడ్పడుగాత మని ప్రార్థించుచుంటిని. జీవులకు మరణమనివార్యము గదా! ఏ దేని రోగపీడితుఁడనై మరణించుటకంటె నొక సోదరుని చేతిలో నత్య

ధర్మపోరాటమునందు మరణించుట సంతస ప్రదముగదా! అట్టి మరణావస్థలోఁగూడ నా హంతకునిమీఁద ద్వేష, క్రోధ విముక్తుఁడనై యుండగల్గిన నది నాశాశ్వతక్షేమకారి యని యెంచితిని.

రాజీ షరతులప్రకారము నూతనధృవపత్రముల నిచ్చు టకై ప్రభుత్వోద్యోగు లాఫీసులలో సిద్ధముగ నుండిరి. క్రొత్తగ నమోదునకుఁబోవువారికి లజ్జలేకుండుటకును నమోదులు క్రమపద్ధతిని మర్యాదగ జరుగుచున్నవేమో చూచుటకును నాయకులే యానాఁడక్కడ నుండవలయుననియు, ధృవపత్రములను దీసికొనవలెననియు నిర్ధారణచేసికొంటిమి. 16 వ తేదీని నా కార్యస్థానమునకు వెళ్ళితిని. సత్యాగ్రహ సంఘము యొక్క కార్యస్థానముగూడ నదియే. గతించినరాత్రి ప్రశ్నలు వేసిన 'మీర్ ఆలమ్' ను అతని సహచరులను నావరణ బైట చూచితిని. మీర్ ఆలమ్ నా ప్రాఁతకక్షిదారుడు. (Client) అతని వ్యవహారము లన్నింటిలో నా సలహా తీసుకొను చుండెడివాడు. మంచి పొడగరి. ఆఱడుగుల యెత్తునకుఁ దక్కువ యుండడు. ధృఢకాయుడు. మామూలుగ నా కార్యస్థానములోనికి వచ్చెడివాడు. ఆనాఁడు బయట నిలువఁబడియుండెను. నన్నుఁజూచినప్పుడు 'సలాము' చేయు చుండెడివాడు. నేడట్లు చేయలేదు. నే నే సలాము చేయగాఁ దిరిగిచేసెను. క్షేమమా యంటిని. అతను "ఔ" ననెను, కాని, ముఖమునందు మామూలు చిరునగవు లేదు. అతనికోప దృష్టులను గమనించితిని. ఏదో జరుగనున్నదని కూడ భావిం

చితిని. కార్యస్థానములోఁ బ్రవేశించితిని. ఇంతలో నధ్యక్షుఁడైన 'ఇసాఫ్‌మియా' గారు నితర మిత్రులును వచ్చిరి. అందఱముకలసి "వాన్ బ్రాండిన్ స్క్వేర్" లోని యాసియా వారి రిజిష్ట్రారు కార్యస్థానమునకు బయలుదేరితిమి. మీర్ ఆలమ్ అతని మిత్రులును మా వెంట వచ్చుచుండిరి. సుమారొక మైలు దూరము పోవలసియున్నది. రిజిష్ట్రారు కార్యస్థానమునకు సుమారు మూఁడు ఫర్లాంగులదూరములోనున్న 'ఆర్నాట్ గిబ్బన్' కంపెనీయొద్ద మీర్ ఆలమ్ నీ వెక్కడికి బోవుచున్నావని హెచ్చరించెను. 'రిజిష్ట్రారు కార్యస్థానమునకు వెళ్ళి వ్రేలిముద్రలు వేసి ధృవపత్రములను దెచ్చికొనఁబోవుచున్నాను. నీవు నాతో వచ్చినయెడల వ్రేలిముద్రలతో నిమిత్తము లేకుండ ధృవపత్రము నిప్పించి పంపుదును' అని ఆఖరు వాక్యము పూర్తిచేసియు చేయకమునుపే యొక పెద్దబరువైన కడ్డీతో నా నెత్తిమీద పెద్ద దెబ్బ వచ్చిపడెను. నేను 'హాఁ దైవమా!' యనుచు నేలఁగూలితిని. స్మృహ తప్పినది. తదుపరి యేమిజరిగినదో తెలియదు. పడిపోయినపిదపకూడ మీర్ ఆలమ్, అతని మిత్రులు తన్నిరట. చాలదెబ్బలు కొట్టిరట. వెంటనే ఇసాఫ్‌మియా, తంబినాయుడుగా రడ్డుపడి దెబ్బలు తప్పించిరట. కాని, యీగల్లంతంతయు దారినబోవు యూరపియనులు విని వచ్చిపడిరి. పారిపోవుచున్న మీర్ ఆలమ్ మొదలగువారిని పట్టుకొనిరి. ఇంతలో పోలీసువారు వచ్చిరి. వారిని బంధించి తీసికొనిపోయిరి

క్రైస్తవమత గురువగు 'గిబ్బన్' గారి సొంత కార్యస్థానమునకు నన్ను మోసుకొనిపోయిరి. స్పృహవచ్చినపిదప

'డోక్స్'గారు "మీ కెట్లున్న"దని ప్రశ్నించిరి. బాగుగనే యున్నానుగాని ప్రక్క యెముకలలోను పండ్లలోను, నొప్పిగ నున్న దని చెప్పితిని. మీర్ ఆలమ్ ఎక్కడ నున్నాడని యడిగితిని. మిత్రులతోఁగూడ నతనిని బట్టుకొని పోలీసులు తీసుకొనిపోయి రని చెప్పినారు "వారిని వెంటనే వదలి వేయ వలెనని నాయుద్దేశ" మని చెప్పితిని. "మంచిది. కాని మీరు క్రొత్త వారి కార్యస్థానములోనున్నారు. మీ పెదవులు చెంప బాగుగా గాయపడియున్నవి. పోలీసులు మిమ్ముల నాసుపత్రికిఁ దీసికొని పోవ సిద్ధముగనున్నారు. కాని, మీరు వెంటనే మాయింటికి నా వెంటవచ్చినచో నా భార్యయు నేనును మీ సేవచేసెదము" అని 'డోక్సు' గా రనిరి. పోలీసులకు నా వందనము చెప్పి మీ వెంట వెళ్ళుటకే నిశ్చ యించుకొంటినని చెప్పుమని చెప్పితిని అంతట నన్ను డోక్సు గారు యింటికితీసుకొని వెళ్ళి యత్యంతాదరణప్రేమలతో చికిత్స చేసిరి. వచ్చుచు బోవుచుండెడివారివలన నావిశ్రాంతికిభంగము లేకుండ నన్ను బహు జాగ్రత్తగఁ గాపాడిరి. ఆసియాశాఖ రిజి ష్ట్రారుగా రింతలో నన్ను జూచుట కిక్కడకు వచ్చిరి. నేను మీ కార్యస్థానమునకువచ్చి పదివ్రేళ్ళముద్రలతో సహారిజిష్టరు పూర్తిచేసి మొదటి ధృవపత్రము తీసుకొనవలెనని తలంచితిని. కాని, భగవంతు డన్యథాభావించెను. ఇపుడే తమరి కార్డు కాగిత ముల నిచటకుఁదెచ్చి నారిజిష్టరును పూర్తిచేయుడనియంటిని. నాకంటె ముందెవ్వరినిగూడ మీరు నమోదు చేయకుండఁగల రని నా నమ్మిక. "తొందర యేమియు లేదు. వైద్య చికిత్స

పొందుచు విశ్రాంతి తీసికొనుడు. అంతయు శుభమగును. రిజిష్టరులో మీ పేరునకు మొదటిస్థాన మునుంచి తదుపరియే యితరులను రిజిష్టరుచేసి, ధృవపత్రముల నిచ్చెద" ననెను. అట్లుకాదు. నేను జీవించియుండుట భగవదిచ్ఛ యగుచో ముందు నేనే నమోదుచేసి ధృవపత్రమును తీసికొందునని ప్రమాణము చేసితిని. అందుచేఁ దమరు వెంటనే వెళ్ళివచ్చి పనిపూర్తిచేయఁగోరుచున్నాను. అనగానే యాయన వెంటనే రికార్డులకై వెళ్ళెను. ఆయనవచ్చులోపుగా ప్రభుత్వ మహా న్యాయవాదికి (అటార్నీ జనరల్) 'మీర్ ఆలమ్'ను అతని స్నేహితులను నేను దోషులుగా భావింపననియుఁ దెలియక వా రట్లుచేసిరనియు,వారిమీద గేసుపెట్టి వారిని శిక్షింప వల దనియు నా కోరికను మన్నించియైన వారిని వదలివేయవలయు ననియు తంతి నిచ్చితిని. వారు నా కోరికను మన్నించి వదలిరి. కాని, పరిస్థితులు నా చేయి దాటిపోయినవి. ఇచ్చటి యూరపి యనులు, బహిరంగముగ హత్యచేయ ప్రయత్నము చేసిన నిట్టి మహాపరాధులను క్షమింప వీలులేదనియు, తన ధర్మము ననుసరించి గాంధిగారు చర్యతీసికొనకపోయినను ప్రభుత్వమే చర్యతీసికొనవలెనని పెద్ద యాందోళన చేసిరి. అందుచే ప్రభు త్వము వారిని శిక్షించి మఱల జైలులో వేసెను. నేను డాక్టరు సలహాను వీలైనంతవఱకుఁ బాటించుచు, చంప ప్రయత్నించినది మహమ్మదీయు డగుటచే, హిందూ మహమ్మదీయ కక్షలు రాకుండఁ గల్లోలము జరుగకుండ నన్ని కట్టుదిట్టములను చేయఁగోరుచు, మిత్రులకును, పత్రికలకును వ్రాయుచుంటిని, ఇంతలోనే రిజిష్ట్రారుగారు రికార్డును తీసికొనివచ్చి నా పేరును

మొదటిదిగా రిజిష్టరు చేయించిరి. నేను బాధపడుచు రిజిష్టరు చేయుచుండుట చూచి రిజిష్ట్రారుగారు చాల దుఃఖించిరి. వీరిని నేను పూర్వ మనేకపర్యాయములు కఠినముగా విమర్శించియుంటిని. బాధానుభవ మెట్టివారి మనస్సునైనను కరిగించునుగదా! దేవుని దయవలన నా రిజిష్టరు పూర్తియైన పిదప నెట్టి యరిష్టము లేకుండ దేశములోని రిజిష్టరులన్నియు సక్రమముగా జరిగిపోయెను. పై యుదంతమంతయు నాపై ముట్టడి జరిగినకొలంది కాలములోనే జరిగిపోయినది. ఎట్టి త్యాగములకైనను వెనుదీయక యూరపియనుల యిష్టానిష్టములను లెక్కచేయక, యత్యంతాదరణ ప్రేమలతో 'డోక్సు' దంపతులు చేసిన సేవవలన పదిరోజులలోనే యారోగ్యమును బొందితిని. తదుపరి వారిని వీడుట యెంతో బాధాకరమాయెను.

## యూరపియనుల సహకారము

గతించిన యధ్యాయమునఁ బ్రత్యక్షముగను బరోక్షముగను యనేక కష్టములకు గురియై, త్యాగములుచేసి మన యుద్యమమునకుఁ దోడ్పడిన యుత్తమపురుషుల చరిత్రలను గ్రంథవిస్తరణభీతిచే నిచ్చుట వదలివేసితిని.

ఇట్లు సహాయముచేసినవారిలో నింగ్లాండు, జర్మనీ మొదలగు దేశములవారును కలరు. యూరపియనుల సహాయ సానుభూతులను పొందుటకై వేఱుగాఁ గృషి యేమియుచేయ లేదు. వారంతటవారే మన యుద్యమము ధర్మయుతమని, సత్యబద్ధమని, పవిత్రాశయములచే సాగించబడుచున్నదని

గ్రహించి తోడ్పడసాగిరి. సత్యధర్మబద్ధమైన యుద్యమ మంతర్వాహినిగా పనిచేసి యుత్తముల యొక్కయు, నుదారచరితులయొక్కయు మనస్సులను ధర్మము వైపునకు మరల్చి సహాయసంపత్తులను జేకూర్చు ననుట కిదియే నిదర్శనము.



# 16 వ అధ్యాయము

## మఱికొన్ని యాంతరంగిక కష్టములు

మాకు నేటాలు భారతీయుల సహాయసానుభూతు లవసరమై యుండెను. వాస్తవమునకు ట్రాన్స్వాల్ సత్యాగ్రహసమరము దక్షిణాఫ్రికాలోని ప్రతిభారతీయుని గౌరవమునకు స్వేచ్ఛకును సంబంధించినదే. అందుచే నక్కడి వారికిఁగలిగిన దురభిప్రాయము తొలఁగింపవలసి యుండెను. అవకాశము దొరికిన వెంటనే నేటాలు వెళ్ళితిని.

వెంటనే నేటాలు భారతీయులసభను దర్బానులో నేర్పాటుచేసితిమి. ఇక్కడకూడ నామీఁద హత్యాప్రయత్నములు జరుగుచున్నవనియు మీరు రావలదనియు పలువురు మిత్రులు హెచ్చరించిరి. రాదలచినచో తగు రక్షణ యేర్పాటులతో రావలసినదని చెప్పిరి. కాని, నాకీ రెండు పద్ధతులును రుచింపలేదు. ప్రజాసేవకునకు తన యజమానుని

పిలుపు రాఁగానే భయముచే వెనుకంజవేసి పట్టివాఁడు సేవకుఁడు కానేరఁడు. అందుచే నిర్ణీతకాలమునకే సభకు జేరితిని. నా మిత్రులచ్చటి పరిస్థితులెఱింగి యుండుటచే నా కంత యిష్టములేకున్నను తగు రక్షణతో వచ్చియుండిరి. రాత్రి 8 గంటలకు సభ జరిగినది. రాజీనిగూర్చి గతయధ్యాయమునందుపలెనే విపులముగ నుపన్యసించితిని. ప్రశ్నపరంపరలకు సమాధాన మిచ్చితిని. ఇక్కడకూడ సభాంతసమయమున ఒక పఠాను దుడ్డుకర్ర చేతపట్టుకొని వేదికమీఁదకు దుమికెను. అప్పుడే దీపములుగూడ నార్పివేయబడెను. వెంటనే పరిస్థితిని గ్రహించితిని. అధ్యక్షుఁడు 'సేట్ దావూద్ మహమ్మదు' కూడ స్థితిగతులను గ్రహించి యెదుట బల్లమీఁద నిలువఁబడి కల్లోలము నడంప యత్నించుచుండెను. వేదికమీఁది మిత్రులు కొంతమంది నా రక్షణకై నా చుట్టును జేరిరి. అందొకరు తనయొద్దనున్న పిస్తోలు పైకి ఊరకే పేల్చెను. ఈలోపుగా క్రమ్ముకొని వచ్చుచున్న వివత్కరసాంద్రమేఘములను గనిపెట్టి 'సేట్ రుస్తుమ్‌జీ' అతి శీఘ్రముగా వెళ్ళి పోలీసు సూపరింటెండెంటు 'అలగ్జాండరు' గారికీ యుదంతమునంతయుఁ దెలియఁజేసిరి. ఆయన వెంటనే పోలీసు భటులను బంపిరి. వారు ప్రజా సమూహముల మధ్యనుండి దారిచేసి నన్ను కాపాడుచు రుస్తుమ్‌జీ యింటికిఁ గొంపోయిరి. రుస్తుమ్‌జీ యక్కడనున్న పఠానులనందరిని సమావేశపఱచి నా యొద్దకు దీసికొనివచ్చి వారికున్న సంశయములను దీర్చుకొనవలసినదని చెప్పెను. నేను వారి ప్రశ్నల నన్నింటికిని సమాధానము చెప్పితిని. ఎంత చెప్పినను వారి దురభిప్రాయము

మును మార్చుకొనలేకపోయిరి. కాలమే సర్వసంశయములను తొలగింపగలదు.

తదుపరి డర్బాన్‌నుండి నా కుటుంబమును జూచుటకై 'ఫోనిక్సు'కు ప్రయాణమైతిని. వలదన్నను మిత్రు లైచ్ఛికముగ రక్షకభటులై వెంటవచ్చిరి. నన్నుఁ దగు జాగ్రతతోఁ గనిపెట్టు చుండి. నేను ఫోనిక్సులో నున్నంతకాల మచ్చటి పత్రికలకు వ్యాసములు వ్రాసియు, మిత్రులతో సంభాషణలు జరిపియు పరిస్థితులను శాంతిపఱుపఁ బ్రయత్నించుచుంటిని.

---

# 17 వ అధ్యాయము

## స్మట్సు సేనాని ద్రోహము

పాఠకు లింతవఱకు నాంతరంగిక కష్టములను ఆసియా నల్లచట్టమునుగూర్చి తెలిసికొనియున్నారు. నా జీవితమునకును నా ధర్మయుద్ధమునకును నవినాభావసంబంధముండుటచే నన్ను గూర్చి వ్రాయవలసివచ్చినందులకు మన్నింతురుగాక!

రాజీకి సంబంధించినంతవఱకు రిజిష్టరు పూర్తి చేసి మా ధర్మమును మేము నెఱవేర్చితిమి. ప్రభుత్వము వారిప్పుడు నల్లచట్టమును రద్దుచేసి వారిధర్మమును వారు నెరవేర్చ

వలసియున్నది ఈయొక్క చట్టమును రద్దుచేసినంత మాత్ర మున దక్షిణాఫ్రికా భారతీయుల కష్ట సుఖములన్నియుఁ దీరిన వని భావింపకుఁడు! ఇంక ననేక కఠిన శాసనముల రద్దుకై చట్ట సమ్మతముగా పని చేయవలసియున్నది.

ఏ దారుణశాసనము దక్షిణాఫ్రికా భారతీయులకేగాక భరత ఖండములోని భారతీయులకుగూడ నిత్యావమానమును గళంకమును దెచ్చుచున్నదో యట్టి "యాసియా దుష్టశాస నము" మీఁదనే మనము సత్యాగ్రహాస్త్రమును బ్రయోగించి తిమి. కాన, నీ శాసనము రద్దగుచో సత్యాగ్రహసమర మిప్ప టికి ముగియును. స్మట్సుసేనాని యాసియాచట్టము నింకను రద్దుచేయలేదు. విశ్వాసద్రోహము చేయఁదలపెట్టి యట్లు చేసెను. అట్లు రద్దుచేయకపోఁగా, మఱియొక విచిత్రమైన క్రొత్తశాసనమును సృష్టించెను. సంఘమంతయు బుద్ధిపూర్వ కముగా రిజిష్టరుజేసి పొందిన ధృవపత్రములన్నియు రాజీ యొడంబడికకు సంబంధించిగాక పూర్వచట్టము ననుసరిం చియే పొందినట్లును గడువుదాఁటిన పిమ్మట రిజిష్టరు చేసి నను నేరస్థులుగా శిక్షింపఁ బడనవసరములేనట్లును, అప్పటి నుండి రాఁబోవు దరఖాస్తుదారులకుఁగూడ నీ చట్టము క్రిం దనే రిజిష్టరు చేసికొనుట కవకాశము గలుగఁజేయునట్లును, నొకేదెబ్బతో రెండుపక్షులఁ గొట్టినట్లు ఈ నూతనచట్టము రెండుశాసనముల యుద్దేశములను సమలులోనికిఁ దెచ్చిన దన్నమాట.

ఈ బిల్లును చదివినప్పుడు నేను మిక్కిలి యాశ్చర్య చకితుఁడ నైతిని. సంఘముయొక్క ముఖ మెట్లు చూడవలెనో నాకు బోధ పడలేదు. నా విమర్శకులకు, హాత్యాప్రయత్నము చేసిన పఠానులకు మంచి సందు దొరికెను. ఈద్రోహము గాని సోదరుల వలన రానున్న యెత్తిపొడుపులుగాని, దూషణలు గాని నన్నేమాత్రము చలింపఁజేయలేకపోఁగా సత్యాగ్రహము నందు దృఢభక్తి విశ్వాసముల నినుమడింపజేసెను. సత్యాగ్రహసంఘమును వెంటనే సమావేశపఱచితిని. నూతనముగ నుత్పన్నమైన సమస్యను వారిముందు బెట్టితిని. శాంతముగ బోధపరచితిని. "మేము మొదటినుండియు స్మట్సు మాయ మాటల గారడీ డనియు, నమ్మరాదనియుఁ జెప్పుటలేదా? ఆంగ్ల మిత్రులనేకులు నట్లే చెప్పియుండలేదా? కాని, మీరందఱిని తేలికగా నమ్మెదరు. కొంపమీఁదకుఁ దెచ్చెదరు. మీసొంత వ్యవహారమైన మీరే నష్టపడుదురు. ఇది జాతికి, సంఘము నకు సంబంధించిన వ్యవహారమాయె. మీ నమ్మకమువల్ల మీరేగాక సంఘమంతటికిని కష్టనష్టములు సంప్రాప్తమాయె. ప్రజా బాహుళ్యమందు నొకప్పుడున్న యుత్సాహము నావేశము పట్టుదల మఱియొకప్పు డుండదుగదా! ఇప్పటి కర్తవ్య మేమి" అని కొంతమంది సభ్యులు ప్రశ్నించిరి.

మీరిట్లు నిందించుట యన్యాయము. ఇప్పటికి మించిన దేమియు లేదు. ఈ రాజీవలన మన ప్రతిష్ఠ హెచ్చలేదా? వారి ద్రోహముఁ బయటఁ బడలేదా? సత్యాగ్రహి యింత మాత్రముచే చలించరాదు. సత్యాగ్రహ సమరము మఱల

నిప్పుడే ప్రారంభమైన మనలోఁ బ్రతివాఁడు చేయదగిన దేమి? మన స్థితి యెట్లున్నది? అని ప్రశ్నించుకొనవలయును. నా మట్టునకు నా నమ్మిక యిది: అప్రతిహతమైన, యకుంఠితమైన దీక్షతో ముందునకు వచ్చి సత్యాగ్రహ శంఖారావము నొనర్చి నంతనే మన సైన్యమునకుఁ గొదువయుండదు. దుర్బలులు గూడ మన యుదాహరణచే సబలులగుదురు. సత్యాగ్రహ సమర పునరారంభమునుగూర్చి కల్గిన సంశయములన్నియు విచ్ఛేదమగునట్లు లెంతయో నచ్చఁజెప్పితిని. అందుమీఁద సభ్యులు తృప్తిపడిరి.

అంత 'కచాలియా'గారు రంగములోనికి దూఁకిరి. వీరు మహాశూరులు, దీక్షాపరులు. వీరు ప్రతివిషయమున సువిచారితమైన తమ యభిప్రాయములను బాగుగా వెల్లడించిరి. తుదివరకెట్టి కష్టనష్టములకైనను వెఱువక నిలువఁబడు ధీరుఁడు. అది యాయన స్వభావము. తుదిఫలితమును గూర్చి సందేహ మావంతయు నాయనకు లేదు. ముఖ్యాంశములు క్లుప్తముగ సభ్యులకుఁ జెప్పి హెచ్చరికజేసి ముగించెను. సభానంతరము మే మొక నిశ్చయమునకు వచ్చినపిమ్మట స్మట్సుసేనాని కిట్లు వ్రాసితిని — "మీరిప్పుడు తెచ్చిపెట్టినబిల్లు కేవలము రాజీకి విరుద్ధమును, విశ్వాసద్రోహమైనదియును.ఇట్లని రాజీజరిగిన వారము రోజులలోనే మీరు 'రిచ్‌మాండు' లో నిచ్చిన యుపన్యాసమే ఋజువుచేయుచున్నది. మీ యుపన్యాసమందలి యీ దిగువభాగము జ్ఞప్తికిఁ దెచ్చుచున్నాను.

'భారతీయ లాసియాబిల్లును రద్దుచేయని దే రిజిష్టర్లు చేయజాలరని వారి వాదన. దాదా వందరి రిజిష్టర్లు పూర్తియైన గాని బిల్లు రద్దుచేయబడదని నా వాదన.'

రిజిష్టర్లు పూర్తియైనచో నల్లచట్టము రద్దగుననియేగదా ఆ వాక్యముల యర్థము! దీనికి మీ సమాధాన మేమని యెన్ని యుత్తరములు వ్రాసినను ప్రత్యుత్తరము లేదు. రాజకీయవేత్తలు తమను చిక్కులలోఁ బెట్టు ప్రశ్నలకు సమాధాన మీయరు. ఇచ్చినను దలతిరుగుడు సమాధానమిత్తురు. మధ్యవర్తులైన కార్టురైటుగారితోను హాస్కన్‌వంటి పెద్దల తోడను దీనినిగూర్చి సంభాషింపగా వారాశ్చర్యచకితులైరి తాము చేయగల కృషినంతటిని జేయుదుమని చెప్పిరి."

---

# 18 వ అధ్యాయము

## తిరిగి యుద్ధము

స్మట్సుసేనాని రాజీవిషయములోఁ దనవిధిని నెఱవేర్చు నట్లు చేయుట కొకవైపునఁ దీవ్రముగ బ్రయత్నించుచు నుద్యమమున కాయత్తముచేయుచుంటిమి. అత్యంతోత్సాహ ముతో రాజోపకసమరమునఁ బాల్గొనుటకుఁ బ్రజలు సిద్ధ ముగా నున్నారు. బుద్ధిపూర్వకముగా రిజిష్ట్రుచేసి పొందిన సర్టిఫికేట్లు యెట్లు బూడిదపాలు కానున్నవో వివరించితిమి. ఆసియావాసులచట్టము (నల్లచట్టము) రద్దుకానిచో వెంటనే యుండలు సర్టిఫికేట్ల కట్టలను గుట్టలుగా వేసి భోగిమంటలు వేయవలెనని ప్రబోధించుచుంటిమి. పరిస్థితు లిట్లుండ నా విజ్ఞప్తులను లెక్కచేయక శాసనసభలో బిల్లు తీర్మానించు టకు ప్రభుత్వము సిద్ధముగానుండెను. ఇంకఁ ప్రయోజనము లేదని మా దృఢనిశ్చయమును దెలియఁజేయుచు స్మట్సు సేనానికిఁ గొంతగడువుతో నంత్యసందేశమును బంపితిమి. ఆయన దాని కిట్లు సమాధానమిచ్చెను.

'ఇట్టి బెదరింపు లేఖలను బంపిన ప్రజలీ నా ప్రభుత్వ మెట్టిదో యెఱుఁగరు. కొంతమంది యాందోళనపరుల హెచ్చ రికలకు లోఁబడి పాప మీ బీదజను లాగ్రహావేశపరులై యిట్లు వ్రాయుచున్నారు. వారిమాయలలోఁ బడినచో సర్వనాశ నమై పోవుదురు;

మా యంత్య సందేశమును వినఁగానే ట్రాన్స్వాల్ శాసనసభ్యులు మండిపడి యీ బిల్లును వెంటనే చట్టముగాఁ జేసిరని యొక పత్రికావిలేఖరి చెప్పెను.



# 19 వ అధ్యాయము

## ధృవపత్రముల భోగిమంటలు

ట్రాన్స్వాలు శాసనసభలో క్రొత్తయాసియా బిల్లు తీర్మానము కావలసియున్నరోజే మా గడువుయొక్క చివరి రోజు. గడువుదాఁటిన సుమారు రెండుగంటల కొక్క పెద్ద సభ నేర్పాటుచేసితిమి. ప్రజలందఱును హాజరైరి. సర్టిఫికేట్ల దహనసంస్కారక్రతువు బహిరంగముగ జరుపవలసియున్నది. కాన, సభావేదికమీఁదఁ తొట్టెలవంటి పెద్దబానలను వరుసగా బెట్టిరి. దాని నిండుగా వేలకొలఁది ధృవపత్రముల కట్టలను గుట్టగాఁ బడవేసిరి. ఈ సభ యేవిధముగాఁజూచినను ప్రయోజనకారియే నను నుద్దేశ్యముతోడనే యట్టివేళ నేర్పాటుచేసితిమి. ఆశలేకున్నను, నా మఱుక్షణములోనైన ప్రభుత్వము నుండి యేదైన యనుకూల సమాధానమువచ్చినచో దానిని సంతసముతో వెల్లడించుటకైనను నీ సభ యుపయోగించునని భావించితిమి. ప్రభుత్వమునొద్దనుండి యేదియేని తెలి

గ్రామువచ్చినచో వెంటనే మాకు జేర్చునట్లు మా కార్యాలయములో ముందుగానే యేర్పాటు చేసియున్నాము సభ 'జోహాన్సుబర్గు' నందలి 'అహమదీయ మసీదు' ప్రాంతములో 1908 వ సం॥ ఆగస్టు 16 వ తేదీని జరుపబడెను. ఇసుక వేసినను రాలనట్లుగా జనులు తండోపతండములుగాఁ జేరి సభాకార్యక్రమమును సాగింపఁబోవు సమయమున నొక స్వచ్ఛందసేవకుడు సైకిలుమీద తంతివార్తనొకదానిని తీసికొని వచ్చెను. అందు ప్రభుత్వ సమాధాన మిట్లు గలదు.

"భారతీయులు చేసిన దృఢనిశ్చయమునకు మేము విచారపడుచున్నాము. మా కార్యక్రమవిధానములను మేము మార్పఁజాలము."

ఈ తంతివార్తను సభ్యులకుఁ జదివి వినిపించితిమి. భోగిమంటల శుభలగ్నము దాటిపోకుండఁ దరుణములో పంపినందులకు హర్షమును దెలియఁజేయుచుండిరా యన్నట్లు జయజయధ్వనులు మిన్నుముట్టెను.

అధ్యక్షుడు సభాకార్యక్రమము నుపక్రమించెను. పరిస్థితులన్నింటిని బూసగ్రుచ్చినట్లు వివరించెను. తాత్కాలి కావేశ మక్కఱకు రాదని హెచ్చరించెను. తదుపరి నేనును జిరకాలమునుండి జరుగుచున్న సంధి సంప్రదింపులను గూర్చి వర్ణించితిని. తాత్కాలికావేశముతో తమ ధృవపత్రములను తగులఁబెట్టుటకై యిచ్చి పశ్చాత్తాపపడు వారెవరైననున్నచో నిప్పటికిని మించిన దేమియు లేదనియు, వెంటనే తిరిగి తీసికొనవచ్చుననియు, దరువాత జింతించుట తగదనియు

నిపుడూరకొని తదుపరి చాటుమాటుగా మఱల గ్రొత్త ధృవ పత్రములఁ దెచ్చికొనుట తమకేగాక సంఘమునకే యగౌరవ మును గళంకమునవియు గట్టిగాఁ జెప్పితిని. ధృవపత్రములు తగులఁబెట్టినంతమాత్రమున నేరము కాదనియు, ఆకారణమున శిక్షకుఁ బోరనియు, నీ చర్యలవల్ల చట్టమునకు లొంగమని మన దృఢనిశ్చయమునుదెలుపుట మాత్రమేయనియు జెప్పితిని. రాఁబోవు నగ్నిపరీక్షకుఁ దాళలేనివారు ముందునకువచ్చి తమ తమ ధృవపత్రములను దీసికొని పొండనియు, మఱియొకసారి హెచ్చరించితిని. 'మాకు ధృవపత్రము లవసరము లేదు. మాకు ధృవపత్రము లవసరము లేదు–తగులబెట్టుడు – తగులబెట్టుడు' అని సభ్యులు కేకలిడిరి. తీర్మానము నెదిరించువా రెవరైన నున్న ముందునకు రమ్మంటిని. ఒకరును రాలేదు. ఇచ్చట నొక సంఘటన జరిగెను. మీర్ ఆలమ్‌కూడ నీ సభలో నుండెను.

"తమపైఁ బడి కొట్టి హత్యచేయ నుద్దేశించి నేను మహాపరాధము నొనరించితిని" నని నిలుఁబడి సభలో నాయన ప్రకటించెను. సభ్యులందఱు మహానందభరితాత్ము లైరి. తన ధృవపత్రములను దగులఁబెట్టుఁ డని కమిటీ కందజేసెను. నే నానందముతో నతని కరస్పర్శచేసి "నామన మ్మునలో నీ మీాద నెన్నడును నెట్టి ద్వేషమును గ్రోధమును గలిగియుండలే" దని నమ్మఁ జెప్పితిని. అతఁడును సంతోష భరితుఁడయ్యెను.

లోఁగడనే సభా వేదికమీఁద సిద్ధముగానున్న ధృవ పత్రములమీఁద నూనెపోసి యిసాఫ్‌మియాగారు నిప్పంటిఁచిరి. ప్రజ్వలించుచున్న యగ్నిజ్వాలతో పాటు లేచి నిలువఁబడి సభ్యులందఱు నొక్కుమ్మడిగాఁజేసిన జయజయధ్వనులు మిన్నుముట్టెను. అదివఱకు ధృవపత్రములనుదెచ్చి సంశయాయాత్ములై తమయొద్ద నుంచుకొన్నవారుకూడ ముందునకు వచ్చి తమ ధృవపత్రములనుగూడ నగ్నిహోత్రున కర్పించిరి.

'లండను టైమ్సు' పత్రికా విలేఖరి యీ సభకు వచ్చి జరిగిన వృత్తాంతమును జక్కఁగా వర్ణించి ప్రకటింపఁ బంపెను.



# 20 వ అధ్యాయము

## నూతన సమస్య తెచ్చిపెట్టితి నను నేరారోపణ

ఒకే సంవత్సరములో నీ దారుణచట్టమును, తదుపరి ట్రాన్సువాల్ వలస నిరోధకచట్టమును స్మట్సుసేనాని శాసన సభలోఁ బెట్టి తీర్మానము చేయించినాఁడు. అందఱికిని వర్తించునట్లు పైకి నీ బిల్లు కనిపించుచున్నను, ముఖ్యముగ నే భారతీయులైనను ట్రాన్సువాలుకు రాకుండఁ జేయు టకే యీ రెండవ చట్ట ముద్దేశింపఁబడినది. 'నేటాలు' ప్రభుత్వచట్టము నే పోలియున్నది. కాని దానికంటె మఱి యొకమెట్టు పైకిఁ బోయినది. నేటాలు వచ్చుటకు వారు విధించిన విద్యార్హతగలవారినిగూడ నీ శాసనము నిరోధించు చున్నది. ఇట్టి స్థితిలో భారతీయులమీఁద 'స్మట్సు' సేనాని తెచ్చిపెట్టిన యీ రెండవచట్టము నుగూడ మే మెదుర్కొన నిచో దాని కంగీకరించినట్లగును. అందుచే శాసనధిక్కార పట్టికలో యీ చట్టమునుగూడఁ జేర్చితిమి. ఇది తప్పయిన దట! ఇట్లుచేయుట నూతనసమస్య తెచ్చిపెట్టుట యట. పాఠకులారా! ఇందలి విరుద్ధమును గమనింపుడు. నూతన చట్టమును ముందుగా సృష్టించినది వారు. తదుపరి శాసన ధిక్కారపట్టికలో జేర్చినది మేము. శాసనమే చేయకున్న శాసన ధిక్కార ప్రశ్నయే లేదుకదా! ఆంగ్లేయుల సహాయ సంపత్తులు లేకుండఁజేయవచ్చు ననియు తనతప్పు నీ విధముగా

కప్పివుచ్చవచ్చుననియు నీ యెత్తు వేసిరి. పాపము! అయ్యె వారిని జేయఁబోయి కోఁతిని జేసినట్లాయెను. న న్నెఱిఁగిన మిత్రులెవరును నమ్మకపోగా యతని కపటనాటకమును బాగుగ గుర్తించి మా యుద్యమమునకు మఱింత తోడ్పడిరి.

---

# 21 వ అధ్యాయము

## "సొ రా బ్జి ష పూ ర్జి అ డ జా జి యా"

ఈయనను 'వలస నిరోధము'ను ధిక్కరించి ట్రాన్సువాల్‌లో ప్రవేశించుటకు సత్యాగ్రహ సంఘమువారు నియమించిరి. సొరాబ్జిషపూర్జిఅడజాజియా సుప్రసిద్ధమైన యొక పార్శీ కుటుంబమునకుఁ జెందినవాఁడు. దానధర్మములలో నెవ్వరికిని దీసిపోనివాఁడు. చాలధీరుఁడు. బారిష్టరు, సుశవాసి. కార్యదక్షుఁడు.

చట్టనిబంధనల ప్రకారము విద్యార్హతగల తనకు ట్రాన్సువాలులోఁ బ్రవేశించు హక్కుగలదనియు, నందుచే నిట్లు ప్రవేశించుచున్నాననియు ప్రభుత్వమునకు ముందుగానే తెలియపఱచి యతఁడు ప్రవేశించెను. ప్రభుత్వము వారియొద్ద నుండి వారికిఁ గొలదిరోజులలోనే దోషిగాఁ బరిగణింపఁబడి

నట్లు నోటీసు వచ్చినది. 1908 వ సంవత్సరము జూలై 8 వ తారీఖున వీరి విషయము కోర్టులో విచారణకు వచ్చినది. ఆనాఁడు న్యాయస్థాన మైదానమంతయు జనసమూహాముతో నిండిపోయెను. 'సమనులో లోపమున్నందున యీయనను వెంటనే విడుదల చేయవలె'నని నేను వాదించితిని. పబ్లిక్ ప్రాసిక్యూట రట్లు కాదని వాదించెను. ఉభయవాదనలను విని న్యాయస్థానమువారు నా వాదము నంగీకరించి సొరాబ్జిగారిని విడుదలజేసిరి. కాని కోర్టునెదుట మఱల పదియవ తేదీని 'హాజరు' కమ్మని యాజ్ఞాపించిరి. ఆయన న్యాయస్థానము నుండి బయటికి రాగానే కరతాళధ్వనులు చేయుచు మహా జనులందరు నాహ్వానముచేసి తీసికొనిపోయిరి. తిరిగి పదవ తేదీని న్యాయస్థానమునకు రాగానే వారము రోజులలో ట్రాన్సు వాలు వదలిపోవలసినదని మేజస్ట్రేటు అజ్ఞాపించెను. ట్రాన్సు వాలువదలెడి యుద్దేశము లేదని పోలీసుసూపరింటెండెంటుగారికి వీరు తెలియఁ బఱచిరి. వారము రోజుల తరువాతఁ గూడ నీయన ట్రాన్సువాలును విడిచిపోనందున పోలీసువారిచే నిర్బంధింపబడి తిరిగి న్యాయస్థానమునకు గొంపోబడిరి. కోర్టు వారు విచారణ తంతు జరిపి యొకమాసము కఠినశిక్ష విధించిరి. ఈ శాసన ధిక్కారమున మొదటివారుగ శ్రీ సొరాబ్జిగారు కారాగారమునఁ బ్రవేశించిరి.

తదుపరి 'సేట్ దావూద్' మొదలగు నుత్తమపురుషులు చాలమంది యొకరివెంట నొకరీ విధముగ శాసనతిరస్కార మునుజేసి ఖైదులను నింప మొదలిడిరి. దావూదుగారి కారా

గార ప్రవేశానంతరము స్త్రీలు, పురుషులు తండోపతండ ములుగ లైసెన్సులు లేకుండ వ్యాపారము చేసియు, పర్మిట్లు చూపక తిరస్కరించియు నసంఖ్యాకముగ నుద్యమమున జేరి ప్రజలలో నూతనోత్సాహ చైతన్యములను గలుగజేసిరి. కారాగారములు నిండుచుండెను. దినదిన ముద్యమము తీవ్ర మగుచుండెను.

బారిష్టరు "రాయప్పన్" దొరగారుకూడ రంగమున దూకెను. ఈయన వలసకూలీ కుటుంబమునకుఁ జెందినవాఁ డైనను ఇంగ్లండు వెళ్ళి బారిష్టరైవచ్చి దక్షిణాఫ్రికాలో న్యాయ వాదిగాఁ బ్రసిద్ధికెక్కెను. మహాభాగ్యభోగము లనుభవించు చుండెను. ఈయన తనజీవిత విధానమువంతను యూరపియనుల పద్ధతిమీదనే సాగించుచుండెడివాడు. కాని, తుదకాయన గూడ కారాగారమునకు వెళ్ళెను.

### ఇసాబ్ సాయిబ్

ఆజన్మభోగియు, కడుసుకవాసియునైన ఇసాబ్ సాయిబ్ వంటివారు మరెందరో సకలైశ్వర్యములను విడిచి ముందు నకువచ్చి జైలులో నష్టకష్టముల పాలగుచుండిరి. ఈయన యారోగ్యము పూర్తిగ చెడియున్నను, మిత్రులువలదనివారించు చున్నను దిరస్కరించి జైలునకు వెళ్ళిన ధీరుఁడు. గంజిత్రాగి యిట్టిస్థితిలోఁగూడ గష్టించిపనిచేసిన శూరుఁడు. ఇట్టివారింక నెందరో కలరు. గ్రంథవిస్తర భీతిచే వదలివేసితిని. వీరినంద అను నధికారులు జైలులో సర్వవిధముల హింసించుచుండిరి. పాకీపనులుకూడ సంతోషముతో చేయుచుండెడివారు. రామ

నామస్మరణ జేయుచునే యీ పనులన్నియు నిర్వహించు చుండెడివారు.

నేనుకూడ వీరితోఁబాటుగ "వాల్ట్రిక్స్" జైలులో నుంటిని. రేవన్న విషయములో వచ్చుచుండెడి వివాదములకు నేను పరిష్కర్తనుగా నుండెడివాఁడను. తక్కినఖైదీలందరును ప్రతి విషయములోను నామాటలను పాటించుచుండెడివారు. ఇట్లుండఱ మెన్నికష్టములకు బాధలకు గుఱియగుచున్నను సంతోషముతోఁ గాలము గడుపుచుండుట జైలుఅధికారులకు కంటకమాయెను. అందుచే నన్నొంటరిగా నొకగదిలోనుంచిరి. ఈ గది నేరములొనర్చిన ఖైదీల నుంచుగదులలో నొకటి. వారమురోజులలో రెండుపర్యాయములు మాత్రము దేహ పరిశ్రమకై ఖైదుబయటికి గొంపోవుచుండెడివారు. ఇచ్చట నధికారులొసంగు నాహార మధ్వాన్నముగ నుండెడిది. కాని, జైలుకష్టములఁగూర్చి యిచట వర్ణించుట నా యభిమతము కాదు. కుతూహలముగలవారు నా యాత్మకథను జదువగోరు చున్నాను.

ప్రభుత్వమున కిప్పుడొక సంకటస్థితి యేర్పడినది. ఖైదీల సంఖ్య నానాటికిఁ బెరిగిపోవుచుండెను. భారతీయులు జంకు గొంకులు లేక ముందునకు వచ్చుచుండిరి. జైళ్ళు నిండిపోవు చుండెను. ఖర్చులు విపరీతమైపోవుచుండెను. ఎంతకాల మెంత మంది నిట్లు నిర్బంధించగలరు? అందుచే మార్గాంతరము నాలోచించుచుండిరి.

# 22 వ అ ధ్యా య ము

## ద్వీ పాం త ర వా స ము లు

వెనుకటి యధ్యాయములో జైళ్ళబాధలను గూర్చి తెలిసికొంటిమి తదుపరి జరిగినదానిని దెలిసికొందము. దుష్ట శాసనము లిచ్చిన యన్నిరకముల శిక్షలను సత్యాధికముగ విధించుటకు న్యాయ స్థానములకు ప్రభుత్వ మధికార మిచ్చినది. అందుచే శిక్షలు తీవ్రమాయెను. అయినను నుద్యమతీవ్రత తగ్గలేదు. కావున ప్రభుత్వమువారు సత్యాగ్రహులను తొంగదీయవలెనని ద్వీపాంతరవాసశిక్షలు విధింప మొదలిడిరి. మొదట నీ ద్వీపాంతరవాసశిక్ష లోక వినోదముగ నుండెడివి. ట్రాన్సువాల్ సరిహద్దులనుదాటి తీసికొనిపోయి నేటాలులోనో మరెచ్చటనో సత్యాగ్రహులను విడిచి వచ్చెడివారు. అచటి ప్రజలు వారి నాదరాభిమానములతోఁ జూచి సౌకర్యములు చేకూర్చుటచే సుఖముగఁ దిరిగివచ్చెడి వారు. తిరిగి సత్యాగ్రహము చేయుచుండెడివారు. ఇది ప్రజలను మఱింత ప్రోత్సాహపఱచెను. ప్రభుత్వము తమ తప్పిదమును గుర్తించి వేలకొలఁది మైళ్ళు దూరదేశములకుఁ గొంపోయి విడిచివచ్చినచోఁ దిండి తిప్పలులేక మాడి చత్తురనియు, లొంగిపోవుదురనియు ద్వీపాంతరవాసములు చేయుచుండిరి. ఇట్లు లోకదళమును బెక్కువేలమైళ్ళదూరముననున్న భారతదేశమునకుఁ దీసికొనిపోయి వదలివచ్చిరి. మేము వారి

సహాయార్థమై తంబినాయుడుగారిని బంపితిమి. వారు భారతీయనాయకుల సాయమున సత్యాగ్రహులకు సౌకర్యములను జేకూర్చి నరకబాధ లేకుండ తప్పించిరి. అక్రమముగా ననేక పశువులను వేలకొలఁదిమైళ్ళదూర దేశములకుఁ బంపుచున్నను కొలఁదిమంది తప్ప తక్కిన వారంఱును ధీరత్వముతో బాధల కోర్చి నిలువఁబడిరి.

### జైళ్ళ బాధలు - నాగప్ప

ఇతఁడు ముక్కుపచ్చలారని పదునెనిమిది యేండ్ల యువకుఁడు. ఇతనిని ప్రతిరోజు తెల్లవారుఝామున తీవ్రమగు చలిలోఁ దీసికొనివెళ్ళి రోడ్డమీఁద రాళ్ళు పగులగొట్టించుచుండెడివారు. ట్రాన్సువాలులోఁ జలి విపరీతము. అందుచే 'డబల్ నిమోనియా' వ్యాధి వచ్చినది. ఊపిరితిత్తులు బొత్తిగాఁ జెడిపోయినవి. ఖైదునకు వచ్చినందుకు ఒక్కనాఁడును పశ్చాత్తాపపడి యెఱుఁగఁడు. మీఁదుమిక్కిలి 'సత్యాగ్రహము జయముపొందుగాక' యని యసువుల బాసెను. ఇట్లింక ననేకమంది స్త్రీలు, పురుషులు బలియైరి. సంఖ్యాబలము కొంత తగ్గినను యుద్యమము సాగుచునేయుండెను.

---

## 23 వ అధ్యాయము

### రెండవ రాయబారము

ప్రభుత్వము విధిలేక విశృంఖలముగాఁ గఠోరమైన దండనవిధానము నవలంబించినను ప్రజలలో నుత్సాహము

పూర్తిగా నశింపలేదు. అట్టి సూచనలు లేవు. పైగా న్యాయస్థానములకుఁ గొంపోబడిన గొన్ని దావాలలోఁ బ్రభుత్వము పరాజయము పొందెను. అందుచేఁ బ్రభుత్వము కూడ నిరుత్సాహపడెను. సత్యాగ్రహులు కొంతమంది వెనుకంజ వేయుటచేతను, చిరకాలము బాధలు పడవలసివచ్చుటచేతను సంఖ్యాబలము తగ్గెను. పోరాటము చాలకాలము కొనసాగునని నిరుత్సాహ పడుచుండిరి. ఇట్లుభయపక్షములును దినదిన బలహీనతలను గ్రహించిరి.

పరిస్థితులిట్లుండ దక్షిణాఫ్రికా రాజకీయములలో సంచలన మేర్పడెను. అన్నివలస దేశములును నేకమై సమాఖ్యగా నేర్పడి, బ్రిటిషు సామ్రాజ్యాంతర్గతమగు నధినివేశముగా నుండవలెనని యొకపక్షమువారు సంకల్పించిరి. మఱియొక పక్షమువారు సంపూర్ణ స్వాతంత్ర్యమును గోరుచుండిరి. ఉభయ సంఘముల తరఫున రాయబారు లింగ్లాండునకు వెళ్ళి బ్రిటిషు మంత్రులతో సంప్రదింపులు మొదలిడిరి. రాయబారము ఫలించినయెడల దక్షిణాఫ్రికా భారతీయులకు రానున్న మహోపద్రవమును గ్రహించితిమి. ఇంగ్లీషువారును, బోయర్లును వేర్వేరై యున్నప్పుడే భారతీయుల నణచివేయుచుండిరి. ఇద్దఱి సంకల్పము నొక్కటే. ఉభయులు నేకమైన నింక మన స్థితి యూహింపుడు. అందుచే మేమును ఇంగ్లండునకు భారతీయుల తరఫున రాయబారవర్గమును బంపితిమి.

మా రాయబారవర్గములో నేనును సేట్ అదీహాబీబ్ గారును నున్నాము. హాబీబ్ గారు ప్రసిద్ధి కెక్కిన వర్తకులు. అనుభవశాలురు. రెండుమూడు భాషలలో జ్ఞానముకలవారు.

మే ముభయులము నప్పటి వలస దేశముల కార్యదర్శి యగు 'మార్లీ' ప్రభువుగారిని దర్శించి మా కష్టముల నన్నిం టిని నివేదించితిమి. ప్రభువుల సభకు, పార్లమెంటునకును మా గోడంతయు విన్నవించితిమి. వారందఱును 'ఆంప్టిల్' ప్రభువుగారును మా కమూల్యమైన సహాయమొనర్చిరి. కాని ఫలితము శూన్యమాయెను. రాయబారము, విఫలమగుటచే తిరిగి దక్షిణాఫ్రికాకుఁ జేరితిమి. ఇట 'టాల్‌స్టాయిఫార' మను నొక యాశ్రమమును స్థాపించితిమి. ఇందు త్యాగమూర్తులును సేవాపరాయణులునగు పెక్కు స్త్రీపురుషులు చేరిరి. కఠినమైన నియమపూర్వకజీవితమును గడపుచు నన్నిపనులును స్వయ ముగాఁ జేసుకొనుచుండెడివారము. రాబోవు ధర్మయుద్ధమును కొనసాగించు అతిరథ మహారథు లిందు శిక్షణబొందుచుండిరి. సత్యాగ్రహసమరము చల్లారిపోకుండ వ్యక్తిగత సత్యాగ్రహ మును సాగించుచు బలువురు ప్రభుత్వము నెదుర్కొనుచునే యుండిరి. ఈ యాశ్రమమున శిక్షణ, సీలములే ప్రధానములు. ధర్మయుద్ధమును సాగించుటకు వలయు సీగుణముల నలవఱచు కొనుచు తరుణమునకై వేచియుంటిమి.

---

# 24 వ అధ్యాయము

## గోపాలకృష్ణగోఖలేగారి సంచారము

పరిస్థితు లిట్లుండ గోఖలేగారిని, నితరపెద్దలను దక్షిణా ఫ్రికావచ్చి యిచటి భారతీయులపరిస్థితులను గండ్లార చూచి

చెవులార విని యనుభవమొనర్చుకొనవలెనని చిరకాలము నుండి నేను కోరుచుంటిని. నేటికి గోఖలేగా రిక్కడకు వచ్చుటకు నిర్ణయించుకొనిరి.

గోఖ్లేగారు ప్రతిభావంతుడైన మితవాద మహానాయకుడు, ప్రజలలోను, ప్రభుత్వములోను జాల బలుకుబడి గలవారు. మేధావంతులు. ఉదారచరితులు. దక్షిణాఫ్రికా భారతీయుల యుద్యమమునుగూర్చి శ్రద్ధగా గమనించుచుండెడివారు. స్టేటుకౌన్సిలుసభ్యులుకూడ. 1910వ సంవత్సరములో "వలసకూలీల నిరోధచట్టము" నంగీకరింపఁ జేసినవారు. దక్షిణాఫ్రికా వెళ్ళి పరిస్థితులను దెలిసికొనఁ గోరుచుంటి నని భారతప్రభుత్వ ప్రధానకార్యదర్శికి వ్రాసిరి. కార్యదర్శిగారు దక్షిణాఫ్రికా ప్రభుత్వమువారికి వీరి హోదానుగూర్చి, పలుకుబడిని గూర్చి తెలియజేసి తగినమర్యాదలతో సన్మానమియ్యవలసినదని అధికారరీత్యా తెలియఁజేసిరి. అందుచే ప్రభుత్వమువారును ఆయనకు గొప్ప స్వాగత మిచ్చుటకుఁ దగిన యేర్పాట్లు చేసిరి.

మనభారతీయుల కాయన రాక మహాప్రమోదదాయకమాయెను. ప్రజలు రాజోచిత సన్మానము చేయుటకు సంకల్పించిరి. ఓడ దిగి యాయనబసకుఁ బోవలసియున్న రాజవీధులన్నిఁటిని బచ్చని తోరణములతోను, స్వాగతపు అట్టలతోను నలంకరించిరి. సన్మానసభలు సాధ్యమైనంతవఱకు వారికి కార్యక్రమములోనున్న నగరములందలి టౌనుహాలులయందే జరుపుటకు నిశ్చయించి, పురపాలకాధ్యక్షులనే యా సభల కధ్యక్షులుగా నుండుటకు గోరఁదలచితిమి.

1912 వ సంవత్సరం అక్టోబరు 22వ తేదీని కేప్ టౌన్‌లో గోఖ్లేగారు వోడ దిగిరి. రాజోచితమైన బ్రహ్మాండమైన యూరేగింపుతో వారిని ప్రధానవీధులగుండ వారి బసకుఁ గొనిపోయిరి. ప్రభుత్వము వారు వారి బసకై యేర్పాటుచేసిన ప్రిటోరియా రైల్వే ఫలహారశాలకుఁ గొంపోయితిమి. అక్కడ బసచేయుటకు మే మంగీకరించితిమి. ఈ యుత్సవములలో ప్రభుత్వము వారును బాల్గొనిరి. వారి సంచారకార్యక్రమము జయప్రదముగానే సాగిపోయినది.

ప్రభుత్వముతో వారుచేయు రాజీప్రయత్నములలో మే మెవరము పాల్గొనకుండుటయే మంచిదను నిర్ణయమును జేసి కొంటిమి గోఖలేగారుకూడ నదియే మంచి దని యభిప్రాయ పడిరి. అందుచే మా తరఫున వాదప్రతివాదముల నన్నింటిని గోఖలేగారు రెండురాత్రులు విని చక్కగ నర్థముచేసికొనిరి. మంత్రులతో సంప్రదించునపుడుపయోగించునని రాజీషరతుల నన్నింటిని వ్రాసి యొక కరపత్రమును గోఖలేగారి కిచ్చితిని.

గోఖలేగారు మంత్రివర్గముతో రెండుగంటలు రాయబారము నెఱపివచ్చి యంతయు మేలే జరుగుననియుఁ దప్పక నల్ల చట్టముతోఁబాటు మూఁడుపౌనుల తలపన్నుఁ యింటి పన్నులు రద్దగుననియు గట్టిగాఁ జెప్పిరి. వలసచట్టములోఁ కూడ వర్ణవివక్షత రద్దగునని చెప్పిరి. నాకుఁ జాల ననుమానముగ నున్నదని చెప్పితిని. వారు సందేహింపఁ బనిలేదనియు, నొక సంవత్సరములోనే మాతృదేశమునకు నేను తిరిగివచ్చుటకు సిద్ధపడవలెననియుఁ జెప్పిరి. వారిరాయబారము ముగిసినది. తిరిగి భారదేశమునకుఁ బ్రయాణమై వెళ్ళిరి.

# 25 వ అధ్యాయము

## వాగ్దానభంగము

బ్రిటిష్‌వారి మోసముల కంతములేదాయెను. నమ్ముట మా సత్యాగ్రహులకు పరిపాటియాయెను. మాటతప్పుట వారికి నలవాటాయెను. నే నూహించినట్లే జరిగెను. గోఖలే గారితో నమ్మకముగఁ జెప్పిన యొక్క విషయమునుగూడ ప్రభుత్వమువా రమలులోనికిఁ దేలేదు. కనీసము మూఁడుపౌనుల పన్నునైనతొలగింపక శాసనసభామందిరమున స్మట్సుసేనాని సుఖాసీనుఁడై యిట్లుచెప్పెను: "నాకెంత కోరిక యున్నను నిచట ప్రజలును శాసనసభ్యులును మూఁడుపౌనుల పన్నునైనను తొలగించుట కెంతమాత్రము నంగీకరించుట లేదు. నే నేమి చేయగలను ?"

మూఁడు పౌనుల పన్ను నేటాలుకు సంబంధించినది. నాలుగు వలశదేశముల సభ్యులతోఁ గూడియున్న ఆ శాసనసభలో కొలఁదిమంది నేటాలుసభ్యులేమిచేయగలరు ? పైగా నీ శాసనమును రద్దుచేయు ప్రతిపాదనను నాయన మంత్రివర్గపక్షమున సభయెదుటపెట్టి ఫలితమును జూడవలసినది. కాని, యట్లుచేయక సభ్యులెవరికి నది యిష్టములేనందున పన్నురద్దు చేయ వీలుకాలే దనెను. చూడుఁడీ చాతుర్యము ! గోపాలకృష్ణ గోఖలేవంటి మహానాయకులనే నమ్మించి మోసము చేసిన బ్రిటిష్‌రాజకీయవేత్తల నే మనవలయునో ?

ఇచట జరిగినయుదంతమంతయుఁ దెలిసికొని మా దూ పానులసమస్య నిప్పుడు కార్యక్రమమునఁ జేర్చవలసివచ్చుటచే, నేటాలు వాస్తవ్యులుకూడ యీ మహాకార్యమునఁ పాల్గొన వలసి యుండుటచే మా కార్యస్థానము 'ఫోనిక్సు'లో నేర్పాటు చేసితిమి.

స్త్రీలుకూడ ముందంజవేసి తమ కవకాశ మీయుఁ డని గట్టిగ కోరుచున్నను, 'బురుషులమీఁద నెక్కువగఁ బ్రయోగింపబడుచున్న యీ చట్టముల విషయములో స్త్రీలనుగూడ ధర్మయుద్ధమున దింపుట న్యాయమా? పరదేశములో నిట్లుచేయుట మఱింత యన్యాయముకదా! మగవారి పౌరుషమునకు భంగము కాదా' యని వాదించినవారును గలరు. అందుచే వారిని సత్యాగ్రహులుగా దీసికొను విషయమున సంశయించుచుండ నీ చిత్రమైన విషయ మొక పెద్ద సమస్యమైనది.

———

# 26 వ అధ్యాయము

## పెండ్లి - పెండ్లికానినాడు

ప్రభుత్వమువారి పాపము పండి ప్రపంచమునకు పరి స్ఫుటముగ వ్యక్తమగునట్లును, నిష్కళంకులైన భారతీయ సోదరుల యుద్యమముయొక్క పవిత్రధర్మస్వరూపము వ్యక్తమగునట్లును, మా యుద్యమముయొక్క విజయబీజములు విప్పారునట్లును, భగవానుఁ డదృశ్యముగఁ బనిచేయుచున్నట్లు తోఁచెడిని. లేకున్న నీ తీర్పు చూడుడు. నలుబదివత్సరముల నుండి దక్షిణాఫ్రికాలో భారతీయులు నివసించు చుండిరి. వారిలో వివిధ మతములవారు గలరు. వారివారిమతముల ననుసరించి శాస్త్రీయముగఁ జేసికొన్న పెండ్లిండ్లు చెల్లవనుప్రశ్నయే రాలేదు. ఇచటనే కాదు. ప్రపంచములో నెచ్చటనుగూడ నీ ప్రశ్నయే లేదు. దక్షిణాఫ్రికాలో రిజిష్ట్రారునొద్దకు దంపతులు వెళ్ళి క్రమముగ రిజిష్టరు చేసికొన్న పెండ్లిండ్లుదక్క తక్కిన పెండ్లిండ్లు న్యాయశాస్త్రరీత్యా పెండ్లిండ్లక్రింద బరిగణింపఁబడ వని ' కేప్‌టౌన్ ' సుప్రీం కోర్టు న్యాయమూర్తి తీర్పుచెప్పెను. దీని పర్యవసాన మేమియో చూచితిరా ? హిందువులు కానిండు, మహమ్మదీయులు కానిండు, మరి యే మతమునకుఁ జెందినవారు కానిండు- వారివారి మతధర్మములననుసరించి శాస్త్రీయముగఁ బెండ్లిండ్లుచేసికొన్న గృహస్థులందరు విటు లనియు, విటురాం డ్రనియుఁ దేలిపోయినది.

ఈతీర్పువల్ల నాగృహస్థులసంతతి సక్రమమైనవారు కారనియుఁ దేలినది. వారు తల్లిదండ్రుల ఆస్తులకు వారసులు కాకుండఁ బోయిరి. పత్రికావరసము కలవాటుపడిన ప్రజలోకక్షణములో దీని ఘోరరూపమును గ్రహించిరి. మా సంఘముయొక్క నిరంతరప్రచారములవలన దేశదేశముల యందును నీ భయంకరమైన తీర్పు అపూర్వమైన సంచలనము కలిగించెను. పురుషులతోఁ బాటు స్త్రీలు నీ మహావమానమును సహింపజాలక వెంటనే యుద్యమమును శుభాశుభ లగ్నములతో నిమిత్తములేకుండ బ్రచండముగ సాగింపుడని గగ్గోలుపెట్టిరి. పవిత్ర నారీమణులే పరాభవింపఁబడిన నాఁడు జాతి యుండిన నేమి, యూడిన నేమి యను భావమును ప్రబలెను.

పరిస్థితు లిట్లుండ మా సత్యాగ్రహసంఘమును సమావేశపరచితిమి. నా యాచారప్రకారము ప్రభుత్వముతో ముందు తరప్రత్యుత్తరములద్వారా సమస్యాపరిష్కారమునకై ప్రయత్నించుట మంచిదని నిర్ణయించితిమి. నేను జనరల్ స్మట్సుగారికి మీరు 'సర్లీ' గారి తీర్పు నంగీకరింతురా యని, అంగీకరింతురేని భారతదేశమున వారి వారి మతముల ననుసరించి చేసికొన్న పెండ్లిండ్లన్నియు హిందూదేశమునందువలెనే యిక్కడఁగూడ శాస్త్రీయములే యని శాసనసభయందు తీర్మానముచేసి పూర్వశాసనమును సవరింతురాయని వ్రాసితిని. కాని, వారు నామాట లాలకించుస్థితిలోఁ గాని సమాధానమిచ్చు స్థితిలోఁ గాని లేరు. ప్రభుత్వమువారివద్దనుండి సమాధానము వచ్చువఱకు వేచియుండుట వ్యర్థమనియు, సత్యా

గ్రహము నింక నాపియుంచుట క్షేమముగాదనియు, తరుణము మించిపోకుండ మహిళాసంఘమునుండి సంతోషముతో శాసన తిరస్కారమునకై ముందునకువచ్చిన మొదటి దళమునందలి సభ్యురాండ్రను బంపితిమి.

తంబినాయుని సతి, యప్పయ్యాపిళ్ళె, మురుగప్ప సతి మొదలగువారు పదునొకండుగురు మహిళ లొక దళముగ వెడలి సరిహద్దులుదాటి ట్రాన్సువాలు ప్రవేసించిరి. కాని ప్రభుత్వము వారు వారిని బట్టుకొనలేదు అట్లయిన వినుగెత్తి పోవుదురని వారుపేక్షించిరి.

మన ఆశ్రమసంబంధము గలవారని తెలియఁగానే ప్రభుత్వోద్యోగులు నిర్బంధములు చేయుట మానిరి. అందుచే మే మిప్పుడొక క్రొత్తపద్ధతి నవలంబించితిమి. మా పత్రికను నడుపువారి నొకరిద్దఱను దప్ప దక్కినవారి నెల్ల నొక్కమ్మడి పైదళముతోబాటు సరిహద్దులను దాటిపోవుటకై నిర్ణయించితిమి. ప్రభుత్వోద్యోగు లడిగినను వారిపేర్లను జెప్పుటకై నిరాకరింపవలె నని చెప్పితిమి పేరుచెప్ప నిరాకరించుట యొక తప్పు. నేటాలునుండి ట్రాన్సువాలునకు బోవుట రెండవ తప్పు. ట్రాన్సువాలు నుండి నేటాలునకు బోవుట మఱియొక తప్పు. ఇట్లనేక విధముల శాసనధిక్కారము చేయుచు స్త్రీలు స్వేచ్ఛగాఁ బోవుచుండిరి.

ఇందు నా భార్య కస్తూరి, డాక్టరు జైకున్వార్ భార్య, మగన్‌లాల్‌గారి భార్య మొదలగువారు 16 మంది కలరు.

వీరందఱును నేటాలునుండి ట్రాన్సువాలునకు, ట్రాన్సువాలు నుండి నేటాలునకు ప్రచారము చేయుచు బోవుచుండిరి. ఆగ్రహావేశములతో మండిపోవుచున్న లక్షలాదిజనులు వీరి బోధల నాలకించుచుండిరి. అందరు నుద్యమములోఁ బాల్గొనుటకు సిద్ధముగా నుండిరి. ప్రభుత్వము బంధింపలేదు.

ఇప్పు డిదివఱ కెన్నడు దలపెట్టని నూతన కార్యక్రమము నారంభించుటకు మా దళమున కాజ్ఞ యిచ్చితిమి. బంగారుగనుల మయమైన ట్రాన్సువాలులోను, నేటాలులోను, న్యూకాసిల్ పట్టణములోను మకాము వేసి పాటకజనములఁ బ్రబోధించి సమ్మెలు చేయింప మొదలుపెట్టితిమి. దానితోఁ బ్రబుత్వమునకు వెట్టఁబుట్టెను. ఒక్కుమ్మడి స్త్రీలనందఱను బట్టుకొని చెరలో బెట్టిరి. ఇఁక దీనిఫలితము జూడుడు! అన్నిపట్టణములలోని కూలివారలును బనులు మాని సమ్మెలుచేయ నారంభించిరి. వీరందఱును క్రమపద్ధతి నుద్యమమునఁ బాల్గొనునట్లు తర్ఫీదు చేయుచుంటిమి. స్త్రీలను జైలులో బంధించినవార్తలు, విశ్వమంతట వ్యాప్తమాయెను. భారతదేశమున నాయకులు శ్రద్ధబూని ఆందోళన చేయఁబూనిరి. ప్రబోధించుచు బోవుచుండిరి. అందుచే నుద్యమము తీవ్రమై కూలిజనమునుగూడ నాకర్షించెను. అన్ని పట్టణములలోని గనులయందు పనులు చేయుచున్న కూలిసంఘములు సమ్మెలుచేసి బయటికి వచ్చిరి. వీరినందఱి నదుపాజ్ఞలలో నుంచి దళములు దళములుగా సరిహద్దులు దాటి ట్రాన్స్‌వాల్ పోవ నారంభించితిమి.

ఈ పాటకజనమందఱిని నా వెంట నిడుకొని వారి నందఱిని సుశిక్షితులుగాఁజేసి ట్రాన్సువాలు యాత్ర సాగించితిని. మార్గమధ్యమున ప్రజలు తండోపతండములుగావచ్చి మా దళములకు సర్వ సౌకర్యములను జేకూర్చు చుండిరి. సంఖ్య వేలకొలఁది పెరిగిపోయెను. వీరందరు నత్యంతభక్తితో సత్యాగ్రహ నియమములను బాలించుచు యాత్రను సాగించిరి. దినములు గడచినకొలఁది ప్రజలలో నూతనోత్సాహము వెల్లివిరియుచుండెను పాటకజను లింకను వచ్చి చేరుచుండిరి. దేశవ్యాప్తమైన సమ్మెలు దౌర్జన్యరహితముగా జరుగుచుండెను. గనులయందలి పనులును వ్యవసాయకేంద్రము నందలి పనులును స్తంభించి పోయెను. యాత్ర కొనసాగినచో తమ యునికికి భంగమనియు, ప్రమాదకరమనియు భావించి యూరపియనులు ప్రభుత్వము నొత్తిడిచేసి, దండన విధానమును తీవ్రమొనరింపఁజేసిరి. నన్నుగూడ బంధించిరి. తర్వాతగూడా దౌర్జన్యరహితముగ నుద్యమము సాగుచునే యుండెను. నన్నిట్లు మూఁడు నాలుగుసార్లు బంధించి విడిచిరి. అందుచే ప్రజలలో నత్యధికమైన యానందమును నకుంఠిత దీక్షయు పెంపొందెను. నానాఁటికి యుద్యమము తీవ్రరూపము దాల్చి, సమ్మెలు సాగుచుండెను. నా వెంటవచ్చిన యాత్రికులనుగూడ బంధించిరి. నా యనంతరము 'పోలక్'గారివంటి నాయకులచే నుద్యమము సాగింపబడుచుండెను. జైళ్ళన్నియు ఖైదీలతో నిండిపోయెను. యాత్రికులు ట్రాన్సువాలు సరిహద్దులయొద్దకు వచ్చుసరికి ప్రభుత్వమువారు యాశ్వికదళములు తుపాకులతోను రైఫుల్సుతోను యాత్రికుల నిరోధిం

చుటకు సిద్ధముగా నుండిరి. అచట యూరపియనులుకూడ సభలుచేసి యాత్రికులను గాల్చుటకు నిశ్చయించుకొనిరి.

ఈ వార్త లెప్పటికప్పుడు తెలియుచున్నను చలింపక యాత్రికులు యాత్రను కొనసాగింపజొచ్చిరి. యూరోపియనుల సభకు 'కల్లెన్‌బాక్' హాజరయ్యెను. ఈయన ఐరోపీయుఁడు, దృఢకాయుఁడు, ధైర్యశాలి. సభలో నాయన యిట్లు వచించెను:—

మీరు ఏమిచేసినను సరే! ఎట్టి దౌర్జన్యము నెఱపినను సరే! నేను జంకను. నేను మీకొక ధర్మసందేశమును దెలిపెదను. మీ రమాయకులైన, నిష్కళంకులైన ప్రజలను హింసింపఁబోవుచున్నారు, వారు మీ కెట్టిహానియుఁ దల చుటలేదు. కేవలము న్యాయముమాత్రమే వారు కోరుచున్నారు. మీ యాస్తిని స్వాధీనముచేసికొన గోరుట లేదు. అట్టివారిని మీరు హింసింపబూనుట మహాపరాధము; ఈ ప్రయత్నము మానుఁడు' అని యెన్నోవిధముల నొక్కి సభవారికి నచ్చఁజెప్పగా యాత్రికులు యేవిధమైన హింసలకు గుఱికాక క్షైత్రయాత్ర సాగించి, ట్రాన్సువాలులోఁ బ్రవేశించిరి. యూరపియనులు నిశ్చేష్టులై చూచుచుండిరి. దేశమున నిట్లుద్యమము బాధలకు లెక్కజేయక, తుపాకిగుండ్లకు వెఱవక నిశ్చలముగ నిరంతరాయముగ సాగి విశ్వవ్యాప్తి నొందెను.

## ఉ ప సం హా ర ము

ఎక్కడి పరిశ్రమ లక్కడనే నిలచిపోవుటచేతను సుమా రఱువదివేల పాటక జనులుకూడ నిందు, జేరుటకు సిద్ధమగుటచేతను నెనిమిది సత్సరముల సంరంభమునకుఁగూడ జంకని ప్రభుత్వమువారు తుదకు సత్యము గ్రహించి రాజీపడిరి. ఖైదీలనందఱను విడుదలచేసిరి. మా సత్యాగ్రహ సంఘము యొక్క న్యాయమైన కోర్కెలన్నింటిని నెరవేర్చిరి. మూఁడు పౌనుల వన్ను రద్దుచేసిరి.

ఆ యా మతములవారివివాహములన్నింటిని శాస్త్రీయ మొనర్చిరి. నిరోధము లన్నింటిని రద్దు చేసిరి. ఇదంతయు పొడిమాటలతోఁగాక శాసనరీత్యా చేసిరి.

స మా ప్త ము.

# — ప్రశ్నలు —

1. వలస నిరోధచట్టము, లైసెన్సు చట్టములఁగూర్చి మీకేమి తెలియును?
2. 1880 వ సంవత్సర ప్రాంతమున ట్రాన్సువాల్‌లోని భారతీయుల కష్టము లేవి? వాని నెంతవఱ కెట్లుతగ్గించిరి?
3. దక్షిణాఫ్రికాలోని యే యే దేశములలోని భారతీయుల బాధల నిందు గాంధీజీ చిత్రించెను?
4. గాంధీజీ దక్షిణాఫ్రికా కే సందర్భములో వెళ్ళెను? యెట్టి యనుభవ ములం గల్గెను? తుద కెట్టి నిర్ణయము కావించెను?
5. గాంధీజీ యే సందర్భములో ఎట్లు దక్షిణాఫ్రికాలో మొదట నివాసమేర్పఱచు కొనిరి?
6. గాంధీజీ ఇండియానుండి కుటుంబముతో దక్షిణాఫ్రికా చేరినప్పటి సంఘటన లేవి? గాంధీజీని ప్రమాదమునుండి యెవరెట్లు తప్పించిరి?
7. రాయబారవర్గము వారి పనిని వివరింపుము.
8. గాంధీజీ వ్రేలిముద్రలం వేయుటకై వెళ్ళినప్పటి సంఘటన యేమి? వానినుండి ఆయన నెవ రెట్లు రక్షించిరి?
9. తంబినాయుఁడుగారిని గూర్చి మీకేమి తెలియును?
10. మొదటిసారి ఖైదులోనికిఁబోయినపుడు గాంధీజీకి కలిగిన భావ ములు వర్ణింపుము?
11. మొదటి రాజీ యెవరెవరిమధ్య నెట్లు జరిగినది? ఎవ రెట్లుల్లంఘించిరి
12. సర్టిఫికేట్ల భోగిమంటలనుగూర్చి మీ కేమి తెలియును?
13. భారతీయ వివాహములు చెల్లవను తీర్పు సత్యాగ్రహోద్యమ వ్యాప్తి కెట్లు తోడ్పడెను?
14. సత్యాగ్రహము యొక్క తుది విజయమునకు ప్రధాన కారణములను పేర్కొనుము?